జనవరి 2019

సంక్రాంతి పండుగ శుభాకాంక్షలతో!



# కొత్తపల్లి

తెలుగు పిల్లల ఈ మాసపత్రిక వెల రూ.30/-

## THE CONSTITUTION OF INDIA

WE, THE PEOPLE OF INDIA, having solemnly resolved to constitute India into a SOVEREIGN DEMOCRATIC REPUBLIC and to secure to all its citizens:

JUSTICE, social, economic and political;

LIBERTY of thought, expression, belief, faith and worship;

EQUALITY of status and of opportunity;

and to promote among them all

FRATERNITY assuring the dignity of the individual and the unity of the Nation;

IN OUR CONSTITUENT ASSEMBLY this twenty-sixth day of November, 1949, do HEREBY ADOPT, ENACT AND GIVE TO OURSELVES THIS CONSTITUTION.

THE ORIGINAL




















సంపుటి: 5 సంచిక: 1 పుటలు: 68 విడి ప్రతి వెల: 30 రూ. జనవరి 2019

ఇంటర్నెట్‌లో ఈ పుస్తకాన్ని వివిధ ఫార్మాటుల్లో ఉచితంగా చదవవచ్చు, డౌన్లోడు చేసుకోవచ్చు, అవసరమనిపిస్తే మీ వాణిజ్యేతర కార్యక్రమాలకోసం మీ అంతట మీరే దీన్ని ముద్రించుకోవచ్చు!

సందర్శించండి: http://kottapalli.in/2019/01/welcome

లైసెన్సు వివరాలు: http://creativecommons.org/licenses/by-nc-sa/4.0/

**Editor:** Narayana Sarma G.V.

**Owned, Printed and Published by:**
Kottapalli Prachuranalu,
1-127/A, Near MRO Office,
Chennekothapalli,
Ananthapuramu District
Andhra Pradesh-515101
Website: http://kottapalli.in
Email: team@kottapalli.in
Phone: 7702877670

**Printed at:**
Mudrica Offset Printers,
Sanyasi Raju street,
Gandhi Nagar,
Vijayawada,
Andhrapradesh
Phone: 08662579129

**RNI Registration No:** APTEL/2014/62705
**Postal Registration No:** HDP/008/2018-2020

**స్ఫూర్తి :** యు. సుబ్బరాజు

**సంపాదకులు:** జి.వి. నారాయణ శర్మ

**ప్రచురణ:**

కొత్తపల్లి ప్రచురణలు, చెన్నేకొత్తపల్లి

**యాజమాన్యం:**

సత్య - ఫౌండేషన్ ఫర్ ఎ హెల్దీ సొసైటీ, చెన్నూరు.

**చిత్రాలు:**

అడవి రాముడు : 9491870753

రాధా స్కూల్ (అనంతపురం) లో చదివే పిల్లలు

**వెబ్సైటు నిర్వహణ:**

ఆనంద్, లక్ష్మి

**వాణిజ్యం, మార్కెటింగు:**

బి. అశోక్: 9963571510

కె. మల్లికార్జున: 9000453887



## విషయ సూచిక





ముఖచిత్రం: రాజ్యాంగ నిర్మాతలు
కూర్పు: సి.రాము

కొత్తపల్లి 103 వ పుస్తకం!




క్వచిత్పృథ్వీశయ్యః క్వచిదపి చ పల్యంక శయనః
క్వచిచ్ఛాకాహారః క్వచిదపి చ శాల్యోదన రుచిః।
క్వచిత్కంథాధారీ క్వచిదపి చ దివ్యాంబరధరో
మనస్వీ కార్యార్థీ న గణయతి దుఃఖం న చ సుఖమ్॥

సంస్కృత మూలం
(భర్తృహరి)

ఒకచో నేలను బవ్వళించు నొకచో నొప్పారు బూ సజ్జపై
నొకచో శాకములారగించు నొకచో నుత్కృష్ట శాల్యోదనం
బొకచో బొంత ధరించు నొక్కొక తఱిన్ యోగ్యాంబర శ్రేణి లె
క్కకు రానీయడు కార్య సాధకుడు దుఃఖంబున్ సుఖంబున్ మదిన్

తెలుగు అనుసరణ
(ఏనుగు లక్ష్మణ కవి)

భావం: ఒక్కోచోట నేలమీద పడుకుంటాడు, ఒక్కోచోట మెత్తని పూలపాన్పు మీద పడుకుంటాడు. ఒక్కోచోట కూరగాయలు తింటాడు; ఒక్కోచోట గొప్ప బియ్యపు అన్నాలు తింటాడు. ఒక్కోచోట బొంతని ధరిస్తాడు; ఒక్కోచోట అద్భుతమైన వస్త్రాలు ధరిస్తాడు. పట్టుదలతో దేన్నైనా సాధించాలని అనుకున్నవాడు ఇక దుఃఖాన్ని, సుఖాన్ని లెక్కించడు.

# విజ్ఞాన ఖనులు

తాతయ్య కళ్ళు మూసుకుని ఏదో ఆలోచిస్తున్నట్లు కూర్చున్నాడు.

"ఏం చేస్తున్నావు తాతయ్యా?, ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నట్లున్నావు?" అడిగాడు రాము. వాడు పుస్తకాలు చదివీ, చదివీ పాతకాలపు జోకుల్ని బాగా అర్థం చేసుకుంటున్నాడు ఈ మధ్య.

"ఏం లేదురా! మా ఇంటికీ, గొడ్ల చావిడికీ పైకప్పు దేంతో వేద్దామా అని ఆలోచిస్తున్నాను" అన్నాడు తాతయ్య చిలిపిగా.

"దానిదేముంది, చక్కని బోద గడ్డి కప్పితే సరి.  ఏడెనిమిదేళ్ళ పాటు ఇంట్లో ఏ.సి. పెట్టుకునే అవసరం ఉండదు" అన్నాడు శేఖరం.  శేఖరానికి పర్యావరణం గురించిన శ్రద్ధ ఎక్కువ. "మనం అందరం ఏదో ఒక విధంగా పర్యావరణాన్ని పాడు చేస్తూనే ఉన్నాం. అట్లా ఉండకూడదు" అని శేఖరం వాదిస్తుంటాడు ఎప్పుడూ.

"బాగుంటుంది గానీ, బోద గడ్డి సరిపోని వాళ్ళకు అందులో పేరుకునే దుమ్మువల్ల ఎలర్జీలు, తుమ్ములూ మొదలైతై" అంది బామ్మ, ఎక్కడినుండో వచ్చి కూర్చుని.

అంతలోనే గట్టిగా తుమ్ముకుంటూ వచ్చింది శ్రీలక్ష్మి. శ్రీలక్ష్మికి చిన్నప్పటినుంచే రక్తంలో ఇస్నోఫిల్స్  ఎక్కువ. చీటికీ మాటికీ తుమ్ములు వస్తూనే ఉంటాయి. శ్రీలక్ష్మి తుమ్ముల్ని చూడగానే అక్కడున్న వాళ్లంతా నవ్వులు చిందించారు.

"నవ్వండి, నవ్వండి. మీకు నవ్వులాటలాగానే ఉంటుంది. తుమ్మిన వాళ్ళకు గదా, తెలిసేది, అందులో కష్టం?! హాచ్, హాచ్, హాచ్, హాచ్!" అంటూ ఆపకుండా నాలుగు తుమ్ములు తుమ్మింది శ్రీలక్ష్మి.

"మనం తినే ఆహారంలోనూ, పీల్చే గాలిలోనూ, తాగే నీళ్ళలో కూడా రకరకాల టాక్సిన్ లు

ఉంటున్నాయి. శరీరాలు వాటినేమీ అనకుండా లోపలికి రానిస్తున్నాయి. పాపం బోదగడ్డి మాత్రమే చెడు చేసిందా ఏమి? టాక్సిన్ ల కంటే ఎక్కువా అది?!" గొణిగాడు శేఖరం.

"టాక్సిన్లంటే గుర్తొచ్చింది. రక్తంలో చేరిన విష పదార్థాలను గుర్తించేందుకుగాను ఆ రక్తపు నమూనాల్లోంచి ఇన్ఫ్రా రెడ్ కిరణాలను పంపించి, దానిలోంచి బయటికి వెలువడే కిరణాలను పరిశీలిస్తారు. దీని కోసం ఈ మధ్య లేసర్లను వాడుతున్నారు. ఈ విద్యను స్పెక్ట్రోస్కోపీ అంటారు. స్పెక్ట్రోస్కోపీకి మంచి పునాది వేసిన శాస్త్రవేత్తల్లో ఒక భారతీయుడు కూడా ఉన్నాడు. ఎవరో చెప్పుకోండర్రా, చూద్దాం, పిల్లలూ?!" అన్నాడు తాతయ్య.

" సీ.వీ.రామన్ " టక్కున చెప్పింది శ్రీలక్ష్మి. "సీ.వీ.రామన్ స్పెక్ట్రోస్కోపీలో చేసిన పరిశోధనలకు గాను ఆయనకు 1930 వ సంవత్సరపు నోబెల్ బహుమతి లభించింది. ఆయన కనుక్కున్న విషయాన్ని 'రామన్ ఎఫెక్ట్' అంటున్నారు శాస్త్రజ్ఞులు.

"అవును. ఇంతకీ రామన్ ఎఫెక్ట్ అంటే ఏమిటి తల్లీ?!" అడిగాడు తాతయ్య.

"అది.., అది..," అంది శ్రీలక్ష్మి. అందరూ నవ్వారు.

"ఏదైనా వస్తువులోకి ఎలెక్ట్రో-మ్యాగ్నెటిక్ కిరణాలను ప్రసరింపజేసినప్పుడు, ఆ కిరణాలు వస్తువులోని సూక్ష్మ కణాలను తాకి, పలువైపులకు విరజిమ్మబడతాయి. ఆ క్రమంలో కొన్నిసార్లు అవి తమ శక్తిని కోల్పోతాయి. కొన్నిసార్లు వస్తు కణాల్లోంచి శక్తిని గ్రహిస్తాయి కూడా. అట్లా ఫోటాన్లలో వచ్చే శక్తి మార్పుని బట్టి, ఆ వస్తువులోని కణాలు ఏమిటనేది కనుక్కునేందుకు వీలు ఏర్పడుతుంది. కిరణాలు ఇలా విరజిమ్మబడుతూ తమ దైర్ఘ్యతని మార్చుకోవడం రామన్ ఎఫెక్ట్ అనమాట" చెప్పాడు శేఖరం.

"అవున్రా శేఖరం, చాలా బాగా చెప్పావు. ఆకాశానికి నీలం రంగు రావటం వెనక కాంతి కిరణాలు ఇలా విరజిమ్మబడటం ఉంది. బయటికి వచ్చే కిరణాలలో శక్తి మార్పులు ఉంటే

దాన్ని రామన్ స్కాటరింగ్ అనీ, అలా శక్తి మార్పులు లేనప్పుడు దాన్ని 'రేలీ' స్కాటరింగ్ అనీ పిలుస్తుంటారు" చెప్పాడు తాతయ్య.

"హుం, ఇదంతా ఇప్పుడు ఎందుకు చెబుతున్నావు?" అడిగాడు బంటీ. వాడు అందరిలోకీ తెలివైన వాడు.

"ఎందుకంటే 1928 ఫిబ్రవరి 28వ తేదీన సీ.వీ.రామన్ తన పరిశోధనా ఫలితాలని వెలువరించాడు. దాన్ని గుర్తుచేసుకుంటూ ప్రతి ఏడాదీ ఫిబ్రవరి 28 ని మన దేశం 'జాతీయ సైన్సు దినోత్సవం' గా జరుపుకుంటుంది. ఆ రోజున అందరం మన జీవితాల్లో సైన్సు తెచ్చిన మార్పుల్ని గుర్తుచేసుకుంటాం. ఈ మాసమంతా శాస్త్రజ్ఞుల్నీ, వాళ్ళు కనుగొన్న విజ్ఞాన అంశాలనీ స్మరిస్తామన్నమాట. అందుకు!" నవ్వాడు తాతయ్య.

"నాకు సైన్సు ఇష్టం లేదు. తెలుగే ఇష్టం" అన్నాడు బంటీ ముద్దుగా.

"మా నాయనే!. నాక్కూడా తెలుగే ఇష్టం. తెలుగులోనైతే కథలుంటాయి!" అంది బామ్మ.

"కథలు, ఆటపాటలు, శాస్త్రజ్ఞానం, సామాజిక జ్ఞానం, భాషా జ్ఞానం, అన్నీ కావాల్సిందేగా, మనిషికి?! దేని ప్రాధాన్యత దానిదే. ఏదిలేకున్నా జీవితంలో చాలా కోల్పోతాం!" అన్నాడు తాతయ్య, మళ్ళీ ఆలోచనలో పడుతూ.

విజ్ఞానశాస్త్రాన్ని నిలిపేందుకు జీవితాన్ని వెచ్చిస్తున్న శాస్త్రజ్ఞులందరికీ సైన్స్ డే శుభాకాంక్షలతో,

కొత్తపల్లి బృందం.

నేను కొత్తగా కనుక్కున్నది ఏమీ లేదు; సృష్టించిందీ ఏమీ లేదు. నా పూర్వీకుల భుజాల పైనుండి మరింత దూరంగా, మరింత స్పష్టంగా చూడగలిగానంతే" -ఆల్బర్ట్ ఐన్‌స్టీన్



# పిచ్చుకలు

బిట్టు కథ

*రచన:శ్రీమతి అనురాధ నాదెళ్ళ, పోరంకి, కృష్ణాజిల్లా.*

ఆరోజు బిట్టు నిద్ర లేచేసరికి ఇంటి ప్రహరీ గోడ మీది నుండి ప్రక్కింటి వాళ్లతో మాట్లాడుతోంది అమ్మమ్మ. బిట్టుకు ఆశ్చర్యం వేసింది. ఆ ఇంట్లో ఎవరుంటారు? తను వచ్చి ఇన్నాళ్ళైంది కదా, ఇప్పటిదాకా ఆ ఇంట్లోవాళ్ళు ఎవ్వరూ తనకు కనిపించనే లేదు!

కొద్ది సేపటికి అమ్మమ్మ కబుర్లు పూర్తిచేసుకొని లోపలికి వచ్చింది కదా, అప్పుడు ఆవిడ చేతిలో అరటికాయలు కనిపించాయి బిట్టుకి. 'అవేమిటి? ఎక్కడివి?' అంటూ ప్రశ్నలు వేసాడు అమ్మమ్మని.

'ప్రక్కింటి జయమ్మమ్మ వాళ్లు ఇన్నాళ్ళూ ఊరెళ్ళారు కదా, ప్రొద్దున్నే వచ్చారు. వాళ్ల పెరట్లో కాసాయట, అరటి కాయలు. మనకు కొన్ని ఇచ్చారు. వాళ్ల మనవడు, మనవరాలు

రేపు వస్తున్నారుట, ఇల్లంతా శుభ్రం చేయించుకుంటున్నారు. పిల్లలు వచ్చాక వాళ్లని మనింటికి తీసుకొస్తానంది జయమ్మమ్మ. చిట్టి, దావీదులతో పాటు వాళ్ళు కూడా నీతో కలిసి ఆడుకుంటారు.'

అమ్మమ్మ మాటలతో బిట్టుకి క్రొత్త ఉత్సాహం వచ్చింది. కొత్త స్నేహితులొస్తున్నారనమాట! మధ్యాహ్నానికల్లా కొంచెం హడావుడి వినిపించి ప్రక్కవాళ్ల ఇంటి వైపుగా చూసాడు. ఓసారి వాళ్ళింటికే వెళ్లి చూసి వద్దామని కూడా అనుకున్నాడు. ఆ మాటే పైకి అనేసాడు; కానీ అమ్మమ్మ వెళ్లొద్దంది: 'వాళ్ళు ఈ పూటే కదా వచ్చింది?! ఇల్లంతా సర్దుకునే హడావుడిలో ఉంటారు. నువ్వు వెళ్లి అడ్డం పడకు. రేపు కలవచ్చులే' అని.

సాయంత్రం నాలుగవుతోంది. ప్రక్క వాళ్ళింట్లో జయమ్మమ్మ కాబోలు, పెద్ద పెద్దగా ఏదో అంటోంది కమలమ్మతో. చిట్టి అక్కడే ఉంది, కమలమ్మ వెనకే.

అది చూసి బిట్టుకి ధైర్యం వచ్చింది. చిట్టిని పిలిచాడు. గోడ ప్రక్కగా నిలబడి 'ఏమైంది, ఎందుకు. జయమ్మమ్మ గట్టిగా మాట్లాడు-తోంది?' అని అడిగాడు.

"ఇక్కడ వీళ్ల ఇంటి వరండాలో పిచ్చుకలు గూడు కట్టాయి! పిచ్చుకలు గొడవ చేస్తున్నాయని, ఆ గూడును తీసెయ్యమం-టున్నారు" చెప్పింది చిట్టి.



బిట్టు గబగబా ఇంట్లోకి పరుగెత్తాడు. వాడి వెనకే రెయిన్బో గాడు కూడా.

బిట్టు అమ్మమ్మ దగ్గరికి వెళ్ళి అడిగాడు: 'అమ్మమ్మా, మనం ఆ పిచ్చుకల్ని తెచ్చుకుందాం!' అని. అమ్మమ్మ నవ్వింది. 'అవి రెయిన్బో గాడి లాగా మనం రమ్మంటేనో, ఊరికే తీసుకొస్తేనో వస్తాయను-కున్నావా బిట్టు? మనం దగ్గరికి వెళ్ళామంటే

చాలు- అవి ఎగిరిపోతాయి! జయమ్మమ్మ వాళ్లు ఊళ్లో లేరు కదా, అందుకని వాళ్ల బాల్కనీలో గూడు కట్టుకున్నాయవి. ఇప్పుడు వాటిని మనం అక్కణ్ణుంచి ఇక్కడికి తెచ్చినా కూడా అవి ఉండవు. చెల్లాచెదురైపోతాయి' అంది. బిట్టుకి దిగులేసింది.

ఇంతలో జయమ్మమ్మ బయటికి వచ్చింది. ఆవిడ వెంటే కమలమ్మ, ఓ పిచ్చుక గూడుని తీసుకొచ్చి గేటు బయట పెట్టింది. మళ్ళీ ఇద్దరూ ఇంట్లోకి వెళ్ళిపోయారు.

బిట్టు అమ్మమ్మ వంక చూసి, 'జయమ్మమ్మ ఇంట్లోకి వెళ్లిపోయింది కదా, నేను తెచ్చుకుంటా అమ్మమ్మా, అ గూడుని?!' అన్నాడు గుసగుసగా.

'పొరుగువాళ్లతో గొడవలు తెచ్చుకోకూడదు బిట్టూ! సరే పోనీలే, ముందు దాని దగ్గరికి వెళ్ళి చూసిరా ఓసారి- గూట్లో ఏవైనా పిచ్చుక పిల్లలున్నాయేమో!' అంది అమ్మమ్మ, సందేహిస్తూనే. బిట్టు నెమ్మదిగా ఆ గూడు దగ్గరకి వెళ్ళాడు. వాడిని గేటు బయట చూస్తూనే చిట్టి కూడా ప్రక్కింటి గేట్లోంచి బయటకొచ్చింది. ఇద్దరూ కలిసి చూస్తే ఆ గూటిలో బుల్లిబుల్లి పిచ్చుకలు ఉన్నాయి!

బిట్టుకి బోలెడు సంతోషం వేసింది. అసలు పిచ్చుకల్ని వాడు ఎప్పుడూ చూడలేదు. ఇప్పుడు ఇంత దగ్గరగా నిజం పిచ్చుకల్ని చూస్తుంటే వాడికి చాలా చాలా థ్రిల్లింగా ఉంది. అమ్మమ్మ దగ్గరకి పరుగెత్తాడు మళ్ళీ.



'అమ్మమ్మా, ఆ పిచ్చుకగూట్లో బుజ్జి పిల్లలున్నాయి. మనింట్లోకి తెచ్చి పెంచుదాం అమ్మమ్మా' అన్నాడు ఆశగా. దాంతో అమ్మమ్మ మణి కూడా వాకిలి దాకా వచ్చి, ఆ గూటిని తీసుకుని తాతమ్మ గది వరండాలో

పెట్టింది. ఆ పైన వంటింట్లో కూరల కోసమని ఉన్న ఓ వెదురు బుట్టని ఖాళీ చేసి, దాన్ని అక్కడ తగిలించి, దానిలో ఆ పిచ్చుకల గూడుని పెట్టింది. ప్రక్కనే చిన్న పళ్లెంలో కొన్ని గింజలు కూడా పెట్టింది.



తాతయ్య వచ్చాక ఆ పిచ్చుకల పోషణ గురించి అడగాలని ఎదురుచూస్తున్నాడు బిట్టు. తాతయ్య రాగానే 'తాతయ్యా, ఈ రోజు నువ్వు, నేను సైక్లింగ్ కి వెళ్లటం లేదు. మనకి ఒక పెద్ద పని ఉంది, రా, చూపిస్తాను' అంటూ ఆయన్ని లాక్కుపోయి, పిచ్చుక పిల్లల్ని చూపించాడు.

ఇంట్లోకి ఇంకో క్రొత్త సందడి వచ్చిందని తాతయ్యకు సంతోషం వేసింది. ఆయన స్నానం చేసి కాఫీ త్రాగి తీరిగ్గా వాటిని పరిశీలించారు:

'ముందుగా మనం ఈ పిచ్చుకలకి తినేందుకు కొన్ని ధాన్యం గిజలు, మంచినీళ్లు ఒక పళ్లెంలో పెట్టి, వెంటనే ఇక్కడ్నుంచి వెళ్లిపోవాలి. వాటి అమ్మా, నాన్న వెతుక్కుంటూ ఉంటాయి వాటికోసం' అని చెప్పి అందరినీ తీసుకుని ముందు వరండాలోకి వచ్చారు తాతయ్య.

'తాతయ్యా, వాటికి మనం ఏం తినిపించాలి? అసలు నాకు పిచ్చుకల గురించి ఏమీ తెలియదు, వాటి గురించి అన్ని విషయాలు చెప్పు తాతయ్యా' బిట్టు కుతూహలం చూసి తాతయ్య హుషారుగా చెప్పటం మొదలెట్టారు. అందరూ ఆయన చుట్టూ చేరారు.

'ఏవైనా గింజలు పెట్టచ్చు. అవైతే మొక్కల

మొదళ్లలో చిన్న చిన్న పురుగుల్ని ఏరుకుని తింటుంటాయి. మా చిన్నప్పుడు ఊరంతా బోలెడు పిచ్చుకలు ఉండేవి. కరెంటు తీగల మీద బారులుగా కూర్చుని కిచకిచమని అల్లరి చేస్తూ ఉండేవి. మా పల్లెటూళ్లో రైతులంతా వాళ్ల ఇళ్ల ముందు ధాన్యపు కంకుల్ని గుత్తులుగా వ్రేలాడగట్టేవాళ్లు. ఈ పిచ్చుకలు, వేరే రకాల పక్షులు కూడా వచ్చి, వాటిని తింటూ, ఇల్లంతా సందడి చేస్తూ ఉండేవి.



ఇళ్ల మధ్య పెరిగే పిచ్చుకలు కొన్ని ఉంటాయి; అవి ఏవి అందుబాటులో ఉంటే వాటిని తింటుంటాయి. చిన్నప్పుడు మా భోజనాలు అయ్యాక, పెరట్లో బావి గట్టున ఖాళీ గిన్నెలు, కంచాలు పెడితే, వాటి చుట్టూ ఉన్న అన్నం మెతుకులు ఏరుకుని తినేవి ఇవి. సాధారణంగా పెంకుటిళ్ల చూరుల్లో గూళ్లు కట్టుకొని ఉండేవి ఇవి. వాటి కిచకిచ శబ్దాలు "ఎంత బాపుండేవో!" వాటినే వింటూ పెరిగేం, మేమంతా.

ఇప్పుడు మటుకు ఈ పిచ్చుకలు ఏమంత ఎక్కువగా కనిపించటం లేదు. పోయిన ఇరవైఐదేళ్లలో పిచ్చుకల సంఖ్య దాదాపు సగానికి సగం తగ్గిపోయిందట! ఇప్పుడిప్పుడే అందరూ అనుకుంటున్నారు, వాటిని సంరక్షించుకోవాలని.

మీకో తమాషా చెప్పనా? ఈ మధ్య ఉత్తర ప్రదేశ్, ఒరిస్సా లాటి రాష్ట్రాల్లో పిచ్చుకల్ని జాగ్రత్తగా కాపాడు కునేందుకు వాటికి పెళ్లిళ్లు కూడా చేసారు కొందరు. వాటి కుటుంబాల్ని సంరక్షించి వాటి సంఖ్యని పెంచేందుకు కృషి చేస్తున్నారు.

పిచ్చుకల ప్రత్యేకత ఏంటంటే, అవి పల్లెల్లోనూ, పట్టణాల్లోకూడానూ జీవించ-గలవు. అవి ఉండే వాతావరణాన్ని బట్టి, ఏ ఆహారం అందుబాటులో ఉంటే ఆ ఆహారాన్ని

తిని జీవించగలిగే తెలివైన పక్షులవి.

ఆడ పిచ్చుకలేమో లేత గోధుమ రంగులో ఉంటాయి; మగ పక్షులు నలుపు, తెలుపు, గోధుమ రంగుల్లో- ప్రత్యేకించి కనబడే చారలతో ఉంటాయి.

పిచ్చుకలు గనక దొరికితే, వాటిని పిల్లులు, గుడ్ల గూబలు, గ్రద్దలు ఎత్తుకుపోయి తినేస్తాయి! కొందరు మనుషులు కూడా పిచ్చుక మాంసాన్ని వండుకుని తింటారు' అని తాతయ్య చెబుతుంటే ఆ వివరాలని అందరూ శ్రద్ధగా విన్నారు.

'తాతయ్యకి ఎన్ని విషయాలు తెలుసో!' అని బిట్టు మురిసిపోయాడు. "అమ్మకి చెప్పాలి. రెయిన్బో గాడితో పాటు పిచ్చుక పిల్లల్ని కూడా పెంచుతున్నామని చెప్పాలి" గర్వంగా అనుకున్నాడు.

'అవి ఎప్పుడు పెద్దవుతాయి తాతయ్యా?' ఆత్రంగా అడిగాడు.

'పిచ్చుక గుడ్లలోంచి 11 రోజుల్లో పిల్లలు బయటికి వస్తాయి. అయితే పుట్టగానే వాటికి రెక్కలు ఉండవు. రెక్కలు పెరిగేందుకు కనీసం రెండు వారాలు పడుతుంది. ఆ తర్వాత అవి మెల్లిగా గూడును వదిలి ఎగిరే ప్రయత్నం చేస్తాయి. ఆ ప్రయత్నంలో ఒకటి - రెండు రోజులు పూర్తిగా నేల మీదే తిరుగుతాయి కూడా. అట్లా ఒక వారం పది రోజుల్లో స్వంతంగా ఎగిరే శక్తి వస్తుందనమాట వాటికి.

అయినా అవి పెద్దవైతే ఎగిరిపోతాయి కదా, నీతో పాటు ఉండమంటేనూ, నీ వెనకే ఇంట్లో తిరగమంటేనూ అవి తిరగవు. అయితే వాటిని మన వరండాలో రోజూ చూడాలంటే ఒక పని చెయ్యొచ్చు. రోజూ వాటికోసం గింజలు, మెత్తని పండు ముక్కలు, చిన్నచిన్న పురుగులు, మంచినీళ్లు అందుబాటులో ఉంచితే మళ్లీ మళ్లీ మన బాల్కనీలోకి వచ్చి ఉంటాయవి. అయితే అవి గూడు కట్టుకున్నప్పుడు దానిని మనం ముట్టుకోకూడదు. అవి మళ్లీ గుడ్లు పెడతాయి, కానీ రెయిన్బోగాడిలాగా నీతో ఆడుకోవు మరి' తాతయ్య నవ్వుతూ

చెప్పాడు.

అన్నీ గమనిస్తున్న తాతమ్మ మెల్లగా వీళ్ళ దగ్గరికి వచ్చింది: 'ఏమర్రా, నా వరండాలో పెట్టారు, పిచ్చుకల గూడు? అవి అల్లరి చేసి నా నిద్ర చెడగొడతాయి!' అంది.




ఆవిడ మాటలకి అందరూ నవ్వేశారు. 'వాటి అల్లరి నీకు ఎక్కడ వినపడుతుందే అమ్మా?' అన్నాడు తాతయ్య గట్టిగా, తాతమ్మకు వినిపించేట్లు. 'నిజమేరా!' అంది తాతమ్మ.

'మీ వరండాలో పిల్లలు ఎక్కువగా మసలరు కనుక పిచుకలు బెదిరిపోవు. అందుకని అలా ఏర్పాటు చేసేను' అని అమ్మమ్మ ఆవిడకి వివరంగా చెప్పింది.

బిట్టుకి ఆరోజు చాలా సంతోషంగా ఉంది. అందరూ వెళ్లాక తన కవితల పుస్తకం తీసి పిచ్చుకల మీద ఓ కవిత రాసుకున్నాడు:

అమ్మ పిచ్చుక గోధుమ రంగు,<br>
నాన్న పిచ్చుక చారల నలుపు, తెలుపు,<br>
పాపాయేమో గులాబి రంగు!<br>
ఎక్కణ్ణించి ఎగిరెగిరొచ్చాయి?<br>
ప్రకృతి వాటిని చేసిందా?<br>
తేనె రంగులో ముంచిందా?<br>
మాటలు, పాటలు, ఆటలు వచ్చు!<br>
అల్లరి కూడా వాటికి వచ్చు!

ఇంకా ఏమిటో రాయాలని అనుకున్నాడు గానీ, నిద్ర వచ్చేసి వెళ్లి మంచం మీద నిద్రలోకి జారిపోయాడు.

(మిగతాది మళ్ళీ వచ్చే మాసం ....)

పిచ్చుకలు రైతుల నేస్తాలు! మొక్కలను ఆశించే చీడ పురుగులను అవి తిని, పంటల్ని కాపాడతాయి



# అత్తా కోడళ్ల కథ

*రచన: మహేంద్ర, ఆంధ్రప్రదేశ్ మోడల్ స్కూల్, చెన్నేకొత్తపల్లి.*

రంగమ్మ చాలా పేదరాలు. ఆమె ఒక్కగానొక్క కొడుకు మహేష్ పుట్టి సంవత్సరం తిరగకనే భర్త చనిపోయాడు. ఆనాటినుండి ఆమె కూలి చేసుకుంటూ కొడుకుని సాకింది. తను ఒక్కపూటే తిన్నా, కొడుకుని మాత్రం ప్రతి రోజూ బడికి పంపింది. "నాయనా, బాగా చదవాలి, మంచి ఉద్యోగం తెచ్చుకోవాలి నాయనా. మనకు వేరే ఆస్తులు లేవు" అని మంచి మాటలు చెప్పి బాగా చదివించింది.

మహేష్ కూడా వాళ్ళ అమ్మ చెప్పినట్లు బాగా చదివాడు. తెలివితేటలు గలవాడు అని పేరు తెచ్చుకున్నాడు. పోటీ పరీక్షలు రాసి మంచి ఉద్యోగం కూడా తెచ్చుకున్నాడు. "ఇంక మన కష్టాలు తీరినట్లే. నువ్వు కూలికి

పోనక్కర్లేదు. జీవితమంతా దర్జాగా ఉండు" అని కొడుకు చెబితే మురిసిపోయింది రంగమ్మ.



అయినా, అన్నీ అనుకున్నట్లు సాగితే ఇది జీవితం ఎందుకవుతుంది? మహేష్‌కి పెద్ద ఇంటి సంబంధం చూసింది తల్లి. నెల తిరిగేసరికల్లా వాడి పెళ్ళి జరగనే జరిగింది. కోడలు రత్నమ్మ అందంగా, సుకుమారంగా ఉండేది. 'కొడుక్కి తగిన భార్య' అని రంగమ్మ సంతోషపడింది.

అయితే ఆ 'తగిన భార్య' రంగులు త్వరలోనే బయట పడ్డాయి. రత్నమ్మకు పొదుపు లేదు. ఎంత దొరికితే అంత ఖర్చు పెట్టేస్తుంది. పెళ్ళయిన నాటినుండీ మహేష్ తన జీతం డబ్బులు తెచ్చి భార్య చేతికే ఇవ్వసాగాడు. ఆమె అటూ ఇటూ చూడకుండా వచ్చిన డబ్బులను మొత్తాన్నీ ఏ నెలకానెల ఖర్చు పెట్టేయ సాగింది.

"ఇట్లా అయితే ఎలాగ?భవిష్యత్తుకోసం కొంచెమైనా దాచుకోవాలి కదా?" అనిపించేది రంగమ్మకు. అయినా కోడలిని మటుకు ఏమీ అనకుండా, ఆమెకు నచ్చిన వంటలు చేసి పెడుతూ మురిపెంగా ఉండసాగింది.

కానీ కోడలికి మాత్రం అత్త తీరు సరిపోలేదు. ముసలమ్మ ముసలి వాసన వచ్చేది. పరిశుభ్రంగా ఉండేది కాదు. అందరినీ ముట్టుకొని ముట్టుకొని మాట్లాడేది; చేతులు కడుక్కోకనే వంటపనికి దిగేది. ఇక ఇరుగు పొరుగులు వస్తే ఏవేవో ముచ్చట్లు పెట్టేది!

అంతేకాక, తన భర్తకు తన కంటే ఈ రంగమ్మ అంటేనే ఎక్కువ ఇష్టం! రోజూ ఆఫీసునుండి రాగానే తనతో ఒక్క నిముషం మాట్లాడి, మిగతా సమయం అంతా

అమ్మతోటే ముచ్చట్లు పెడతాడు! తను పలకరిస్తే అలసిపోయినట్లు ముఖం పెడతాడు కానీ తల్లి దగ్గర మాత్రం చాలా సంతోషంగా, అసలు ఆపకుండా మాట్లాడుతూనే ఉంటాడు!

చివరికి కోడలు విసిగిపోయింది. టీవీ సీరియళ్ళలో చూపించే అత్తాకోడళ్ళ పోట్లాటలు కూడా ఆమెను ప్రభావితం చేసి ఉండాలి: అత్తను ఎలాగైనా ఇంటినుండి తరిమేయాలని నిశ్చయించుకున్నది.

ఇక అప్పటినుండీ రంగమ్మ ఏ పని చెప్పినా చేయటం మానేసిందామె. ఎప్పుడూ "నీకు తిండి దండగ. నీవల్ల మాకు ఏమాత్రం ప్రయోజనం లేదు. నువ్వు ఏ అనాథాశ్రమానికో వెళ్లచ్చుగా, మా సంతోషానికి ఎందుకు, అడ్డుగా ఉంటావు?" అనటం మొదలు పెట్టింది.

ఒకసారి మహేష్ ఆఫీసు పని మీద క్యాంపుకు వెళ్ళిన సమయం చూసుకొని అత్తతో పెద్ద పోట్లాట వేసుకొని ఇంట్లోంచి బయటికి గెంటి వేసింది.

ఆ రోజునే రంగమ్మ నిశ్చయించుకున్నది: 'తనకు ఇంకా శక్తి ఉన్నది; ఇట్లా వీళ్ల మీద ఆధారపడి ఉండవలసిన అవసరం లేదు- తమ ఊరికి వెళ్ళి స్వతంత్రంగా ఉండచ్చు' అని.

అయితే ఆమె అట్లా రైలెక్కేందుకు వెళ్తుండగానే, క్యాంపునుండి ఇంటికి తిరిగి వస్తున్న కొడుకు ఎదురయ్యాడు- "ఎక్కడికి, వెళ్తున్నావు?" అంటూ. తల్లి చెప్పకనే సంగతినంతా గ్రహించిన అతను "సరే, నువ్వు ఊరికి వెళ్ళు" అని చెప్పి, తన మిత్రుడు ప్రవీణ్‌కు ఫోను చేసాడు. ప్రవీణ్ పోలీసు అధికారి.

అతను సంగతంతా విని, "ముసలి తనంలో తల్లి దండ్రులను చూసుకోవటం పిల్లల బాధ్యత. దాన్ని సక్రమంగా నిర్వర్తించని వాళ్ళు శిక్షార్హులు కూడా! నువ్వు నేను చెప్పినట్లు చెయ్యి. ముందు నా దగ్గరికి వచ్చి, రెండు మూడు రోజులు మా ఇంట్లోనే ఉండు" అని ఏదో చెప్పాడు.

తర్వాత కొద్ది సేపటికే పోలీసులు రత్నమ్మ

ఇంటి తలుపు తట్టారు: "మీరు మీ అత్తని ఇంట్లోంచి తరిమేసారని వార్త అందింది మాకు. మీరు మా వెంట స్టేషనుకు రావాలి" అని.

రత్నమ్మ కంగారుగా భర్తకు ఫోను చేసేందుకు చూసింది. కానీ మహేష్ ఫోను స్విచ్ ఆఫ్ చేసుకొని ఉన్నాడు! దాంతో ఆమె ఆ రోజంతా పోలీసు స్టేషన్‌లో గడిపింది. మరునాడు కూడా ఆమె స్టేషనులోనే ఉంది.

అక్కడి పోలీసులు ఆమెతో "మీ అమ్మే గనక నిన్ను చిన్నప్పుడు భారమనుకొని వదిలేసి ఉంటే నువ్వెక్కడ ఉండేదానివి? రేపు ప్రొద్దున నీకు పుట్టబోయే కొడుకు, వాడి భార్య నిన్ను భారంగా బావించి ఇంటి నుండి తరిమేస్తే నీ పరిస్థితి ఏంటి?" అని రకరకాలుగా చెప్పారు.

"ఆమె మంచిది కాబట్టి మా దగ్గరికి రాలేదు. వచ్చి కేసు పెట్టి ఉంటే నీతోబాటు నీ భర్తని కూడా మేం అరెస్టు చేయాల్సి వచ్చేది. ఆమెకు ఏదైనా అయితే మీ ఇద్దరికీ ఏళ్ల తరబడి జైలు శిక్ష తప్పదు" అని భయపెట్టారు కూడా.

మూడో రోజు ఉదయం పోలీసు స్టేషనుకు వచ్చిన మహేష్ తనకు ఇదంతా ఇప్పుడే తెలిసినట్లు నటిస్తూ, "అయ్యో! మా అమ్మ ఇంత పని చేస్తుందనుకోలేదు. నీ మీదనే పోలీసు కంప్లయింటు ఇస్తుందా?! ఆమె పని చెబుతానాగు!" అన్నాడు.




అప్పటికే హృదయపరివర్తన చెందిన రత్నమ్మ "ఇందులో అత్తమ్మ తప్పేమీ లేదు. అంతా నేను చేసిందే! పాపం, ఈ వయసులో ఆమె ఎక్కడున్నదో, ఎలా ఉన్నదో! తను పోలీసుల దగ్గరికి పోనే లేదట! నేనే, పనికి మాలినదాన్ని, తనని అర్థం చేసుకోలేక

ఇంట్లోంచి తరిమేసాను" అని కళ్లనీళ్ళు పెట్టుకున్నది.

పోలీసు అధికారిగా ప్రవీణ్ కూడా భార్యాభర్తలిద్దరినీ కూర్చోబెట్టుకొని గట్టిగా మాట్లాడాడు. "మీ అమ్మ మీ సొంత ఊరికే వెళ్ళిందని తెల్సింది. మర్యాదగా మీరిద్దరూ వెళ్ళి అవిడని ఒప్పించి ఇంటికి తెచ్చుకుంటారా, లేకపోతే మేమే మీ మీద పూర్తిస్థాయి క్రిమినల్ కేసు వ్రాసుకోవాలా?" అని అడిగాడు.

రత్నమ్మ చెంపలు వేసుకుంటూ "బుద్ధి వచ్చింది సర్, ఇక ఎన్నటికీ ఇలాంటి పరిస్థితి రానివ్వం. ఆవిడని పువ్వుల్లో పెట్టి చూస్కుంటాం" అన్నది.

అదే రోజున వాళ్ళిద్దరూ వెళ్ళి రంగమ్మను ఒప్పించి మళ్ళీ ఇంటికి తీసుకెళ్ళారు. ఆ తర్వాత ఇక ఎలాంటి పొరపొచ్చాలు లేకుండా అంతా కలిసి మెలిసి జీవించారు.

భాస్కరా!

పలుచని హీన మానవుడు పాటి దలంపక నిష్ఠురోక్తులన్
బలుకుచునుండు గాని మతి భాసురుడైన గుణ ప్రపూర్ణుడ-
ప్పలుకుల బల్కబోవడు నిబద్ధిగ, ఎట్లన, వెల్తి కుండ దా
దొలుకుచునుండుగాని మరి దొల్కునె నిండు ఘటంబు భాస్కరా?!

అల్పబుద్ధి గల మనిషి పెద్దా చిన్నా తేడాలు లేకుండా ఇష్టం వచ్చినట్లు కఠినంగా మాట్లాడుతూ ఉంటాడు గానీ, బుద్ధి కుశలత కలిగిన మంచివాడు అట్లా ఊరికే నోరు పారేసుకోడు. వెలితి కుండ తొణుకుతుంది గాని నిండు కుండ తొణకదు కదా!

సామెతలు!

సామెత లేని మాట ఆమెత లేని ఇల్లు.

మానవులుండరు కాని మాటలు నిలిచిపోతాయి.

ఆలు ఏడ్చిన ఇల్లు, ఎద్దు ఏడ్చిన సేద్యం ముందుకు రావు.




# అన్న-తమ్ముడు

*రచన: బి.రాజేశ్వరి,* 8 *వ తరగతి,* ZPHS, *కంకణాలపల్లి, ప్రకాశం జిల్లా.*

రామాపురం జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాలలో శ్రీధర్, మురళి అనే అన్నదమ్ములు ఇద్దరు చదివేవాళ్ళు. ఇద్దరూ అన్నదమ్ములే అయినా వాళ్ళ ప్రవర్తన చాలా భిన్నంగా ఉండేది. శ్రీధర్‌లో స్వార్థం పాలు ఎక్కువ అనిపించేది. వాడు తనకంటే చిన్నపిల్లల్ని బెదిరించేవాడు; పెద్దల్ని ఎదిరించేవాడు; ఎవ్వరికీ సహాయం చేసేవాడు కాదు. "సాయం చేయొచ్చు కదా! ఏమౌతుంది?" అని ఎవరైనా అంటే "నాకేంటి లాభం?" అనేవాడు. వీడితో పోలిస్తే వీడి తమ్ముడు మురళి బాగుండేవాడు. చిన్నవాళ్లంటే కొంత ప్రేమ, పెద్దలంటే కొంత గౌరవం ఉండేవి వాడికి. తోటివారికి సాయం కూడా చేసేవాడు.

టీచర్లు, పిల్లలతో సహా అంతా తమ్ముడిని మెచ్చుకుంటుంటే అన్నకి కుళ్ళుగా ఉండేది.

అయినా శ్రీధర్ ఇతరుల్ని తప్పు పట్టేవాడు తప్ప, తన ప్రవర్తనని మాత్రం మార్చుకునేవాడు కాదు.

ఇలా ఉండగా ఒకసారి వాళ్ళ బడి పిల్లలంతా విహారయాత్రకని బయలుదేరారు. అందరితో-పాటు వీళ్లిద్దరూ కూడా వెళ్ళారు. ఆ యాత్రలో శ్రీధర్‌ని ఎవరూ పట్టించుకోలేదు. అసలు అతను ఉన్నా లేనట్లే ప్రవర్తించారు. ఇక మురళితో మాత్రం ప్రతి ఒక్కరూ స్నేహంగా ఉన్నారు. అందరూ వాడిప్రక్కన చేరి సంతోషంగా ముచ్చట్లు పెట్టారు.




అది చూసి శ్రీధర్‌కు అంతకంతకూ బాధ పెరిగి పోయింది. దర్శనీయ స్థలాల వద్ద కూడా, అందరూ ఒక ప్రక్కన నడిస్తే, శ్రీధర్ ఒక్కడూ మరో ప్రక్కన నడిచాడు. భోజనాల సమయంలో కూడా, అందరూ కలివిడిగా అక్కడి వింతలు-విశేషాల గురించి కబుర్లు చెప్పుకుంటూ చాలా ఆనందంగా గడిపితే, శ్రీధర్ మటుకు ఒంటరిగా కూర్చొని కుళ్ళుకుంటూ భోంచేసాడు.

ఆ రోజు సాయంత్రం అంతా వెనక్కి తిరిగి వస్తున్నారు, బస్సు దగ్గరికి. పిల్లలంతా బాగా అలసిపోయారు. అయినా గందరగోళంగా, గుంపులు గుంపులుగానే ఉన్నారు. శ్రీధర్ మటుకు ఒక్కడే, ఏదో ఆలోచిస్తూ, నడుస్తున్నాడు. ఉన్నట్టుండి అతనికి ఒక బండ కొట్టుకుంది. రక్తం ధారగా కారసాగింది. అయినా ప్రతి ఒక్కరూ అతన్ని చూసి, ప్రక్కకు తప్పుకొని వెళ్తున్నారు తప్ప, అతనికి సాయం చేసేందుకు ఎవ్వరూ ముందుకు రాలేదు.

చివరికి మురళియే వాళ్ళ అన్నను చూసి, "అయ్యో! పెద్ద దెబ్బే తగిలిందే!" అనే సరికి అందరూ అక్కడ గుమిగూడారు. అందరూ మురళి వెంట ఉండి వాళ్ల అన్నను ఆసుపత్రికి

తీసుకొని వెళ్ళారు.

గాయం తగ్గాక శ్రీధర్ "చూసావా, ఎవ్వరికీ నేనంటే ఇష్టం లేదు! ఇట్లాంటి వాళ్లకు నేను మటుకు ఎందుకు సాయం చెయ్యాలి?" అన్నాడు తమ్మునితో, కోపంగా.

అప్పుడు మురళి "నిజమే అన్నయ్యా! చూశావా! మనం విహార యాత్రకు వెళ్ళినప్పుడు నీకు దెబ్బ తగిలితే కూడా ఎవ్వరూ నీకు సాయం చేయలేదు. నువ్వు "ఇతరులకు సహాయం చేస్తే నాకేంటి లాభం" అంటావుగా, అలాగే వాళ్లంతా కూడా అనుకున్నారనమాట! అది తప్పు కదా?! స్నేహ సంబంధాలను ఎవరికి వాళ్ళు పెంచి పోషించుకోవాల్సి ఉంటుంది. మనం ముందుకు పడి సాయం చేస్తే, వేరేవాళ్ళు కూడా సమయం వచ్చినప్పుడు మనకు సాయం చేస్తారు. ముందుగా మనం ఇతరులందరినీ దూరం పెట్టామనుకో, అప్పుడు వాళ్ళు కూడా మనల్ని దూరం పెడతారు" అన్నాడు.

తమ్ముడు ఏమంటున్నదీ అర్థమైన శ్రీధర్ తనను తాను మార్చుకోవాలని నిశ్చయించుకున్నాడు. "ఇకమీద అవతలి వాళ్ల తీరును పట్టించుకోను. నా అంతట నేనుగా అందరికీ సాయం చేస్తాను" అనుకున్నాడు.




శ్రీధర్‌లో వచ్చిన మంచి మార్పుని బడిలో పిల్లలు కూడా త్వరలోనే గుర్తించారు. వాళ్లకు తెలీకుండానే అందరూ మురళి పట్ల స్నేహ భావనతో మెలగసాగారు. కొద్ది నెలల తర్వాత అన్నదమ్ములిద్దరూ బడిలో ఎంత మంచి పేరు సంపాదించుకున్నారంటే 'అబ్బ! వీళ్ళను చూస్తే ఎవరూ అన్నదమ్ములు అనుకోరు- మంచి ఫ్రెండ్స్ అనుకుంటారు!" అని చెప్పుకోసాగారు అందరూ.




# మారిన దొంగ

*రచన: చాతుర్య, 7 వ తరగతి, రిషీ వ్యాలీస్కూల్, మదనపల్లి, చిత్తూరు జిల్లా.*




రాజీవ్ అనే కుర్రవాడు చక్కగా చదివి, చదువు పూర్తయ్యాక ఉద్యోగం కోసం వెతుక్కుంటూ పట్టణం చేరాడు.

అక్కడికి వెళ్లగానే ఉద్యోగం దొరుకుతుందనుకున్నాడు; కానీ దొరకలేదు.

అట్లా కొద్ది రోజులు గడిచేసరికి అతను పట్టణంలోని జల్సాలకి అలవాటు పడ్డాడు. డబ్బులు సరిపోక మెల్లగా దొంగతనాలకు కూడా అలవాటు పడ్డాడు!

త్వరలోనే దొంగతనాల వల్ల వాడి దగ్గర చాలా డబ్బులు పోగయ్యాయి. వాటిని చూసుకొని

వాడు మరిన్ని దొంగతనాలు చేయటం మొదలు పెట్టాడు.

తల్లి దండ్రులు ఫోను చేసినప్పుడల్లా "నేను బాగున్నాను- పెద్ద ఉద్యోగం దొరికింది. పని చాలా బాగుంది" అని చెప్పేవాడు వాడు. దాంతో వాళ్ళు పాపం తమ కొడుకు ప్రయోజకుడయ్యాడని అందరికీ గొప్పగా చెప్పుకునేవాళ్ళు.

అట్లా కొన్ని నెలలు గడిచాయి. అంతలో ఒకరోజున రాజీవ్ ఇంట్లోనే దొంగతనం జరిగింది! దొంగతనాల ద్వారా అతను పోగు పెట్టుకున్న డబ్బులు అన్నీ పోయాయి. తన సొమ్ము పోయేసరికి వాడికి చాలా బాధ వేసింది. కానీ తను ఎవ్వరికీ చెప్పుకోలేదు! పోలీసుల దగ్గరికి కూడా పోలేదు!

"నా సొమ్మును దొంగతనం చేసినవాడు నాశనమైపోతాడు. వాడిని నేనే పట్టుకొని శిక్షిస్తాను!" అని వాడు చాలా ఆవేశపడ్డాడు.

అయితే ఆ రోజు రాత్రి అలసిపోయి పడుకునే ముందు వాడికో ఆలోచన వచ్చింది: 'దొంగతనం చేసి సంపాదించిన డబ్బులు పోతేనే తను ఇంత బాధపడుతున్నాడు; మరి కష్టపడి ఏదో పని చేసుకొని నాలుగు డబ్బులు వెనకేసుకున్న వాళ్ల డబ్బుల్ని తను దొంగిలించినప్పుడు వాళ్లెంత బాధపడి ఉంటారు? తనని ఎన్ని తిట్లు తిట్టి ఉంటారు?'



ఆ ఒక్క ఆలోచన వల్ల వాడిలో పరివర్తన వచ్చింది. దొంగతనాలు, జల్సాలు మానేసి, తనకు ఎదురైన ఏదో ఒక చిన్న ఉద్యోగంలో చేరాడు. బాధ్యతగా పనిచేసి నిజంగానే ప్రయోజకుడయ్యాడు.

కాలు జారితే తీసుకోగలం గానీ నోరు జారితే తీసుకోలేం!



# నేరము-శిక్ష

*నిజంగా ఈ కలలున్నాయే, అవి మనకు చెప్పి రావు ఎందుకనో...*

*రచన : M.తావి, వికాస విద్యావనం, పోరంకి, కృష్ణాజిల్లా.*



ఆ రోజు ఆదివారం.

రవి అల్పాహారం తిని, అలా ఊరి బయట తిరిగి వద్దామని బయలు దేరాడు.

మెల్లగా వాళ్ల ఊరికి దగ్గర్లో ఉన్న నది గట్టున నడుచుకుంటూ వెళుతున్నాడు. అలా పోతూ ఉంటే అతనికి నది ఒడ్డునే ఓ పెద్ద

మామిడి చెట్టు కనబడ్డది.

మామిడి చెట్టుపైన ఒక పక్షి గూడు ఉంది. ఆ గూటిలో ఏమున్నాయో చూడాలని అతనికి ఆశ పుట్టింది.




వెంటనే గబగబా చెట్టు ఎక్కాడు వాడు.

ఆశగా గూడులోకి తొంగి చూసాడు. గోధుమరంగు గుడ్లు ఉన్నాయి అందులో.

వెంటనే వాటిని జేబులో వేసుకోని క్రిందకు దిగబోయాడు.

అంతలోనే కాలు జారి నదిలో పడ్డాడు.

నదిలో ఉన్న మొసలి ఒకటి రవి కాలును పట్టుకొని నది లోపలికి లాక్కెళ్లింది.

నీళ్లల్లో ఊపిరి ఆడక, గట్టిగా బిర్ర బిగుసుకు పోయాడు రవి. మొసలి రవిని తీసుకు పోయి ఒక కోట గుమ్మాన వదిలేసింది.

రవి గభాలున లేచి, నదినుండి దూరంగా పోవటం కోసమని, ఆ కోటలోకి దూరాడు.

ఆ కోటలో ఒక రాజుగారు- బంగారు సింహాసనం మీద కుర్చుని ఉన్నాడు. ఆయన రవికేసి చూస్తూనే, కోపంగా "నువ్వేగా, పిట్ట గుడ్లని దొంగతనం చేసిన పిల్లోడివి?. తప్పు చేసావు కాబట్టి నీకు శిక్ష తప్పదు" అన్నాడు!

వెంటనే వాడిని అక్కడికి పట్టుకొచ్చిన మొసలిని పిలిచి, "నువ్వు వీడి వీపుపై నీ తోకతో ఇరవై దెబ్బలు కొట్టు" అని ఆదేశించాడు. మొసలి రవిని కొట్టేందుకు ముందుకు వచ్చింది. తన తోకని పైకెత్తి వాడిని ధబాలున కొట్టబోయింది.

ఆ క్షణాన్నే రవి భయంతో కేక వేసి, మంచం మీది నుండి కింద పడ్డాడు. చూస్తే తనకి వచ్చింది ఒట్టి కలే! గుడ్లూ లేవు; మొసలీ లేదు! నేరమూ లేదు; శిక్షా లేదు!!




# మామ చేసిన మాయ

*రచన: ఆసిఫ్, 8 వతరగతి, జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా.*

ఏడో తరగతి చదివే అఖిల్ చాలా తుంటరి పిల్లవాడు. చదువుల్లో మనసు అస్సలు నిలిచేది కాదు వాడికి. కానీ చేతులు మటుకు ఎప్పుడూ పులవుల పెడుతూ ఉండేవి.

వాడి తుంటరి పనులతో అందరూ విసిగిపోయారు: "ఒరే! చక్కగా చదువుకుంటూంటే కొంచెం అల్లరి చేసినా ఎవ్వరూ ఏమీ అనరు. చదవకుండా పోరంబోకువైతే అసలు ఎవ్వరూ మెచ్చరు. రాను రానూ బ్రతుకు కష్టం అవుతుందిరా!" అని ఎంత చెప్పినా వాడు మాత్రం వినేవాడు కాదు.

అయితే రోజులన్నీ ఒకలాగా ఉండవు కదా, అనుకోకుండా ఒక రోజున ఓ అద్భుతం జరిగింది. ఆ రోజు కూడా వాడు బడి ఎగగొట్టి ఎప్పటిలాగానే ఊరి చివర్లోని

పాడుబడ్డ ఇంటికి పోయాడు. ఆ యింటి చుట్టూ చెట్లు, తుప్పలు, అటు మూలన ఓ పాడుబడ్డ బావి ఉంటాయి.

అయితే ఆ రోజున ఎందుకనో, బావిలోంచి రంగు రంగుల పొగలు బయటికి వస్తున్నాయి! దానికి తోడు "ఢుం!ఢుం!" అంటూ భయంకరమైన శబ్దాలు!

అఖిల్‌కి కొంచెం భయం వేసింది. అటూ ఇటూ చూసాడు, ఎవరైనా పెద్దవాళ్ళు కనిపిస్తారేమో, ధైర్యానికి అని. అయితే అసలు అటువైపుకే ఎవ్వరూ రారాయె! ఒక్క క్షణం పాటు వాడికి పారిపోదామనిపించింది గానీ, అడుగులు వెనక్కి తిరగలేదు. వాడు ఎంత 'వద్దు! వద్దు!' అని గింజుకులాడినా అవి మాత్రం బావి వైపుకే దారి తీసాయి.

బావి లోపలికి దిగేందుకు మెట్లు ఉన్నాయి. మెట్లు అక్కడక్కడా విరిగిపోయి ఉంటాయి; కానీ ఎక్కడ ఎలా ఉంటాయో వాడికి కొట్టిన పిండే. ఇప్పుడు వాడి కాళ్ళు ఆ మెట్లను దిగటం మొదలు పెట్టాయి. అఖిల్ మనసు బిగిసిపోయింది. "వద్దు వద్దు" అంటోంది; కానీ కాళ్ళు మనసు మాట వినట్లేదు. ఇంకేదో శక్తి వాటిని నడిపిస్తున్నట్లుంది.

వాడి ముఖం పాలిపోయింది; ఒళ్ళంతా చెమటలు పడుతున్నాయి; బావిలోంచి దట్టంగా వస్తున్న రంగు రంగుల పొగకు వాడికి ఊపిరి ఆడనట్లు అనిపిస్తోంది. ఇంకా మూడు నాలుగు మెట్లు ఉన్నాయి అనగా వాడికి ఒక భయంకర దృశ్యం కనిపించి కాలు జారింది..



బావిలో ఒక రాక్షసుడు. దుమ్ము కొట్టుకొకుండా జుట్టుకు ఓ ఎర్రటి బట్ట, ఆకు పచ్చని వొంటి నిండా వెంట్రుకలు, ఎర్రని-తెల్లని బొట్లు. మెడలోను, చేతులకు

ఎముకల దండలు. నడుము చుట్టూ ఒక పుర్రెల దండ. వాడు చకిలంమకిలం వేసుకొని కూర్చొని, ఉయ్యాల లాగా ఊగుతూ ఏవేవో మంత్రాలు జపిస్తున్నాడు. వాడికి ఎదురుగుండా ఒక యజ్ఞ గుండం ఉంది. మంత్రాలు చదువుతూ మధ్య మధ్యలో ఆ మంటలోకి ఏవో పొడులు విసురుతున్నాడు వాడు. ఒక మూలగా మరుగుజ్జు ఒకడు పెద్ద ఢంకా లాంటి దాన్ని "ఢుం ఢుం" అని కొడుతున్నాడు..

అఖిల్ దబ్బుమని క్రింద పడేసరికి రాక్షసుడి యజ్ఞం భంగమైంది. వాడు కళ్ళు తెరిచి కోపంగా అఖిల్ వైపు చూసాడు. అఖిల్ తేరుకునే లోగానే వాడు చటుక్కున లేచి, పైకెగిరి, తన చేతిలోని మంత్రదండంతో అఖిల్ నెత్తి మీద దభాలున ఒక దెబ్బ కొట్టాడు. మరుక్షణమే స్పృహ తప్పాడు అఖిల్.

మెలకువ వచ్చేసరికి అఖిల్ కాళ్ళు చేతులు కట్టేసి ఉన్నాయి. వాడిప్పుడు యజ్ఞగుండం ముందు పడేసి ఉన్నాడు. మరుగుజ్జువాడు ఆగి ఆగి ఢంకా కొడుతున్నాడు. రాక్షసుడు కళ్ళు మూసుకొని "హ్రీం హ్రాం భం" అని అరుస్తూ విరగబడి నవ్వుతున్నాడు.

అఖిల్ కళ్ళు తెరవటం చూసిన రాక్షసుడు మంత్రాలు చదవటం ఆపి బిగ్గరగా "ఒరే! కుర్రా! నువ్వు నాకు సరిగ్గా సరిపోయావ్. 'చదువు సంధ్యలు లేకుండా, పోరంబోకుగా తిరిగే కుర్రవాడిని పంపు తల్లీ! నీకు బలి ఇస్తాను!' అని ఆ తల్లిని కోరుకోగానే నువ్వు దిగి వచ్చావు. నిజంగానే చదువు రాని వాడివి! నిజంగానే పోరంబోకువి! తల్లి కోరి పంపిందిరా, నిన్ను! ఇంకొద్ది సేపట్లో ఆ తల్లినే చేరతావు నువ్వు!" అంటూ పొడిని యజ్ఞగుండంలోకి వేసి, ఊగటం మొదలెట్టాడు వాడు కళ్ళు మూసుకొని.

అఖిల్ గుండె ఆగినట్లైంది. ఏడుపొచ్చింది. కొంచెం సేపు బిగ్గరగా ఏడ్చాడుగానీ, రాక్షసుడు అసలు పట్టించుకోలేదు. చివరికి "నువ్వనేది అబద్ధం. నేను పోరంబోకును కాదు! నేను చదువుకున్న పిల్లాడిని!" అని అరిచే సరికి, రాక్షసుడిలో చలనం వచ్చింది.

వాడు ఎగతాళిగా నవ్వుతూ "అవునా? అయితే మరి ఏమైనా పద్యాలు చెప్పు? ఎక్కాలు చెప్పు? ఇంగ్లీషు రైమ్సు చెప్పు? ఏమీ రావు, చూసావా?! వట్టి రోషం! ఎందుకు పనికొస్తుంది?!" అన్నాడు.

"బలికి పనికొస్తుంది గురూ!" అన్నాడు మరుగుజ్జువాడు, అవతలినుండి, ఆవలిస్తూ. "బాగా చెప్పావురా, బలికి పనికొస్తాడు వీడు. అంతే" అన్నాడు రాక్షసుడు.




ఆ వెంటనే కొద్ది సేపు అఖిల్‌కు తల తిరిగింది. తను రకరకాల పాములతో యుద్ధం చేస్తున్నట్లు, బలి ఇచ్చే కత్తితో వాటిని చంపుతున్నట్లు అనిపించింది.

సాధారణంగా అఖిల్‌కు ఇరవయ్యో ఎక్కం వరకూ రావు. పదమూడు నుండి అన్నీ తప్పులే ఉంటాయి. అయినా వాడు లేని ధైర్యం నటిస్తూ, రెండో ఎక్కంతో మొదలెట్టి గడగడా చెప్పటం మొదలెట్టాడు. వాడి తప్పులన్నీ భరించిన రాక్షసుడు "తప్పులున్నాయిరా!" అని నవ్వి, "పద్యాలు?" అని అడిగి, అవన్నీ కూడా చెప్పించుకున్నాడు. 'తప్పులో', రైట్లో' గాని ప్రాణభయంతో అఖిల్ నోటికి ఏ పద్యం వస్తే అది, చెప్పాడు.

వింటున్న మరుగుజ్జు వాడు "ఇప్పుడెట్లా, గురో!" అని కేకపెట్టాడు అకస్మాత్తుగా. "వీడు కొంచెం చదివే పిల్లాడు లాగే ఉన్నాడు. మనకి పనికి రాడు గురో!" అంటూ వచ్చి అఖిల్ తలమీద గట్టిగా మళ్ళీ ఓ మొత్తు మొత్తాడు.

ఆ దెబ్బకి మళ్ళీ స్పృహ తప్పిన అఖిల్‌కి ఈసారి పాములు, కత్తులు, మంచు కొండలు, కుక్కలు, సింహాలు అన్నీ కనబడ్డాయి. వాడు అన్నిటితోటీ పోరాడుతూ పోయాడు.

తెలివి వచ్చి కళ్ళు తెరిచే సరికి వాడు ఆ

పాడుబడ్డ ఇంటి గేటుదగ్గరే పడి ఉన్నాడు. తల బొప్పి కట్టి ఉన్నది! బావిలోంచి పొగ ఏమీ రావట్లేదు. పరిసరాలన్నీ పదిలంగానే ఉన్నాయి. రాక్షసుడూ, వాడి అనుచరుడూ ఇద్దరూ జాడ లేరు.




వణికే కాళ్లతో ఇల్లు చేరుకున్న అఖిల్, ఆ తర్వాత రెండు రోజుల పాటు నిద్రపోతూనే ఉన్నాడు. ఆ సరికే ఇంటికి వచ్చి ఉన్న రంగామామయ్య, వాళ్ల కొడుకు ఇద్దరూ అఖిల్‌ని పలకరించారు. మధ్యలో మామయ్య ఒకసారి "ఒరే! పద్యాలు చెప్పు! ఎక్కాలు?" అన్నప్పుడు అఖిల్‌కి 'ఈ గొంతు ఎక్కడో విన్నానే?!' అనిపించింది; అయితే అలసిపోయి ఉండటాన వాడు ఇక ఏమీ అనలేదు.

కానీ ఆ తర్వాత వాడు బాగా మారిపోయాడు. అల్లరి తగ్గించేసాడు; రోజూ బడికి పోతున్నాడు; బాగా చదువుతున్నాడు; బాగా ఆడుతున్నాడు కూడా. తల్లిదండ్రులు అది చూసి సంతోషిస్తూ "ఇదంతా రంగా మామ చలవే!" అనుకున్నారు. "కాదు- రాక్షసుడి మహిమ" అనుకున్నాడు అఖిల్.

**జాగ్రత్తలు!**

1. మొరగని కుక్కతోనూ, పారని నీటితోనూ జాగ్రత్త.
2. సహనం గల వ్యక్తికి వచ్చే కోపం దారుణంగా ఉంటుంది జాగ్రత్త!
3. తీరిక లేకుండా గడిపే నిస్సారమైన జీవితంతో జాగ్రత్త!
4. చిన్న రంధ్రమే పెద్ద పడవను ముంచుతుంది. జాగ్రత్త!
5. అతి జాగ్రత్తతో ఎన్నో నష్టాలున్నాయి. దాంతో మరీ మరీ జాగ్రత్త!




# ప్రాణత్యాగం

**కొత్త బేతాళం**

*ఆధారం : గోదా లిఖిత్ కుమార్, పదవతరగతి, బనిగండ్లపాడు, ఖమ్మం జిల్లా.*



పట్టువదలని విక్రం తిరిగి చెట్టు వద్దకు వెళ్ళి, బేతాళాన్ని భుజంపైన వేసుకొని, చెట్టుదిగాడు. అంతలో రోబో బేతాళం కదిలి, "చూడు విక్రం, ఒక పోలీసు అధికారిగా నీకు నా మీద ఏం కోపమో అంతుపట్టడం లేదు. ప్రతి ప్రాణికీ ఒక నీతి ఉంటుంది. అయితే నువ్వు చేస్తున్న పని మటుకు నాకు తెలిసి ఏ నీతి ప్రకారమూ సరైనది కాదు. గతంలో చంద్ర ప్రభుడు అనే

చిన్నవాడు ఒకడు నీ మాదిరే ఆలోచించి బ్రహ్మరాక్షసుడికి కూడా లోకువైనాడు. అలసట తెలీకుండా ఉండటం కోసం నీకు అతని కథ చెబుతాను- నోరెత్తకుండా విను" అంటూ ఇలా చెప్ప సాగాడు.

అవంతీ రాజ్యపు మంత్రి సుశర్మకు ఒక్కగానొక్క కొడుకు చంద్రప్రభుడు, దూర దేశంలో విద్యనభ్యసిస్తున్నాడు. కథ మొదలయ్యేనాటికే అతని చదువు ముగిసింది. అతను గురువుగారి ఆశీస్సులు అందుకొని, తన మిత్రులు ముగ్గురితో కలిసి అవంతికి తిరుగు ప్రయాణం అయ్యాడు.

చంద్రప్రభుడి మిత్రులు కిశోరుడు, పిప్పలుడు, అనూరుడు ముగ్గురూ మూడు సామంత రాజ్యాల యువరాజులు. యువకులు నలుగురూ కూడా సాహసులూ, ధైర్యవంతులూ, ఔత్సాహికులూనూ.

వాళ్ళు అలా తిరిగి వస్తుండగా మార్గ మధ్యంలో ఒక పెద్ద మర్రి చెట్టు కనిపించింది. అనేక శాఖలతో ఒక పెద్ద అరణ్యంలాగా విస్తరించి ఉన్న ఆ చెట్టుని చూడగానే మిత్రులు నలుగురికీ అక్కడ కొంత సేపు విశ్రమించాలనిపించింది.

అలా అనిపించటానికి కారణం ఆ మర్రిచెట్టు మీద ఎన్నో ఏళ్లుగా నివసించే ఒక బ్రహ్మరాక్షసుడు. వాడి పేరు ప్రచండుడు. వాడు తన మాయా ప్రభావం చేత అటువైపుగా వెళ్ళే బాటసారులను ఆకర్షించి, ఆనక వాళ్లను తినేస్తూ ఉండేవాడు.




వాడికి ఈ నలుగుర్నీ చూడగానే చాలా సంతోషం వేసింది; దానితోబాటు కొంత విచారం కూడా కలిగింది. ఏమంటే బ్రహ్మ శాపం ప్రకారం వాడు ఒక రోజున ఒక్క

ధైర్యశాలిని మించి తినలేడు! అలా ఇప్పుడు వీళ్లను నలుగుర్నీ ఒకేసారి మ్రింగేసే అవకాశం పోయింది వాడికి.

తక్షణం వాడు తన మెదడుకు పని పెట్టాడు. 'ఏదైనా ఒక మాయ చేసి, వీళ్లని ఒక్కరొక్కరుగా, నాలుగు రోజులపాటు తినాలి' అని వాడు పథకం సిద్ధం చేసుకొని, భీకరంగా అరుస్తూ వాళ్ల ముందుకు దూకాడు.




వాడి అరుపులకు ఆకాశం వణికింది. భూమి కంపించింది. ప్రశాంతంగా నిద్రపోతున్న నలుగురూ గబాలున మేల్కొని, వరల్లో ఉన్న కత్తులు బయటికి లాగారు.

ఎదురుగా అంతెత్తున నిలబడి, గదని త్రిప్పుతూ, భీకరమైన కంఠంతో వికటాట్టహాసం చేస్తున్న ప్రచండుణ్ణి చూడగానే నలుగురికీ ఒక ప్రక్కన భయం వేసినా, మరొక ప్రక్కన విపరీతమైన క్రోధం కలిగింది. అయితే వాళ్ళ కత్తులు బ్రహ్మరాక్షసుడిని ఏమీ చేయలేక, వంగిపోయాయి! నలుగురు యోధుల ముఖాలూ తెలవెల పోయాయి.

ప్రచండుడప్పుడు చికాకును, బద్ధకాన్నీ నటిస్తూ "ఇంక చాలు. నేను అనుమతించకుండా మీరెవ్వరూ తప్పించుకోలేరు ఎలాగూ. ప్రస్తుతం నాకు బాగా ఆకలిగా వుంది. అందులోనూ మీలాగా బలమైన మనుష్యుల్ని తిని చాలా ఏళ్లయ్యింది. చూస్తుంటే కుస్తీ యోధుల్లా నోరూరిస్తూ ఉన్నారు. మీలో ఎవరైనా ఒకరు నాకిప్పుడు ఆహారం కండి. మిగతావాళ్లని వదిలేస్తాను. లేకపోతే నలుగుర్నీ ఒక్కసారిగా తినేస్తాను. వెంటనే ఆలోచించుకుని చెప్పండి.

ఇవాళ్ల నాకు ఎవరు ఆహారం అవుతారు?" అని అరిచాడు.

అతని మాటలు వినగానే చంద్రప్రభుడు ముందుకొచ్చి "ఓయీ! బ్రహ్మరాక్షసా! ప్రాణత్యాగానికి నేను సిద్ధం. దయచేసి నా మిత్రులు ముగ్గురినీ వదిలెయ్యి. ఆనక నీ సంతోషం కొద్దీ నన్ను భక్షించవచ్చు!" అన్నాడు ధైర్యంగా. బ్రహ్మ రాక్షసుడు నివ్వెరపోయినట్లు అతనికేసి చూస్తూ ఉండిపోయాడు.

అయితే మిగిలిన ముగ్గురి ఆలోచనలూ వేరేగా ఉండినై. వాళ్ళు ముగ్గురూ కట్టగట్టుకున్నట్లు ఒక్కసారిగా పరుగు లంకించుకున్నారు.

అయితే వాళ్ళు మర్రి చెట్టును ఇంకా దాటకనే ప్రచండుడు వాళ్ళ ముందు ప్రత్యక్షం అయ్యాడు! భయంతో తన్నుకులాడుతున్న ముగ్గురినీ చేతుల్తో బంధించి నోటి దగ్గరికి తీసుకెళ్తూ "పిల్ల కుంకల్లారా! నానుండే తప్పించుకోవాలని చూస్తారా?! ఇంక మిమ్మల్ని ఎవ్వరూ కాపాడలేరు!" అని అరచాడు కోపంగా.

"నన్ను వదిలెయ్! నేను బంధుర రాజ్యపు యువరాజును. నీకు ఆహారం అయ్యేందుకు చంద్రప్రభుడు ఒప్పుకున్నాడుగా? వాడిని తిని, మమ్మల్ని ముగ్గుర్నీ వదిలెయ్" అని వేడుకోసాగాడు అనూరుడు.




మిగిలిన ఇద్దరూ కూడా జాలిగా ఏడుస్తూ "అవునవును. భూతశ్రేష్ఠా! మేమైతే రాజకుమారులం. రాజ్యానికి మా అవసరం చాలా ఉంది. వాడు కేవలం మంత్రి కొడుకు. వాడిని తింటే వేరే ఎవరికీ నష్టం లేదు" అనటం మొదలుపెట్టారు.

ప్రచండుడు వాళ్లు ముగ్గుర్నీ, చంద్ర ప్రభుడినీ కొంత సేపు మార్చి మార్చి చూసాడు. ఆ తర్వాత ముగ్గుర్నీ ఒక్క సారిగా నోట్లోకి వేసుకొని మింగేసి, చంద్రప్రభుడిని మటుకు ఏం చేయకుండా విడిచి పెట్టేసాడు.

బేతాళం కథ చెప్పటం ఆపి, "ఇంతకీ బ్రహ్మరాక్షసుడు ముగ్గురినీ ఎలా తినగలిగాడంటావు? ఎవరైనా ఒకరు ప్రాణత్యాగానికి సిద్ధపడితే మిగిలిన ముగ్గుర్నీ వదిలేస్తానన్నవాడు, దానికి వ్యతిరేకంగా చేయటం ధర్మ విరుద్ధం అవ్వదా? చంద్రప్రభుడిని ఎందుకు వదిలేసాడు? అతనిలోని నీతి సంపద వల్ల రాక్షసుడి హృదయంలో పరివర్తన కలిగి ఉంటుందా?" అని అడిగింది.

విక్రం చిరునవ్వు నవ్వి, "నేను మాట్లాడగానే నువ్వు తిరిగి చెట్టెక్కుతావని తెలుసు. అయినా నీకు సమాధానం చెబుతాను. బ్రహ్మరాక్షసుడి హృదయపరివర్తన ఒట్టిదే. నిజంగా అట్లాంటిదేదైనా ఉంటే వాడు అందరినీ వదిలిపెట్టేసి ఉండేవాడు. బ్రహ్మశాపం ప్రకారం వాడు రోజుకు ఒక్క ధైర్యశాలిని మాత్రమే తినగలడు. 'భయంతో కొట్టుమిట్టాడే ముగ్గురిని తినాలా, ధైర్యంగా నిలబడ్డ ఒక్కడిని తిని ఊరుకోవాలా?' అన్న ఆలోచనలో వాడి 'భూత నీతి' ముగ్గురిని ఎంచుకునేట్లు చేసింది. చంద్రప్రభుడి ధైర్యమే వాడిని కాపాడిందనటంలో సందేహం లేదు. మిగిలిన ముగ్గురూ తమలోకి పిరికితనాన్ని రానివ్వటం ద్వారా బ్రహ్మరాక్షసుడికి ఆహారం అయిపోయారనాలి!" అన్నాడు.

విక్రంకి అలా మౌనభంగం అవ్వగానే బేతాళం అతన్ని తప్పించుకొని ఎగిరి వెళ్ళి, మళ్ళీ చెట్టెక్కింది.

**చిలిపి ప్రశ్న తిక్క జవాబు**

ప్రశ్న : అద్దం జైలుకు ఎందుకెళ్ళింది?
జవాబు : ఎందుకంటే దాన్ని ఫ్రేంలో ఇరికించారు కాబట్టి!
ప్రశ్న : మనం ఆరేప్పుడు తడిసేది ఏది?
జవాబు: టవల్




# సందేశం

*నిజమే, కదా? కారుకంటే విలువైనవి మన దగ్గర చాలానే ఉన్నాయి. వేటినీ వృధా కాకుండా చూసుకోవటం మన బాధ్యత.*

*రచన: హిమవర్షిణి, 8 వ తరగతి, రిషీ వ్యాలీ స్కూల్, మదనపల్లి.*

బ్రెజిల్ దేశంలో ఒక కోటీశ్వరుడి దగ్గర ప్రపంచంలోకెల్లా అతి ఖరీదైన కారు ఒకటి ఉండేది. ఒకసారి ఆయన తన ఆ కారుని "ఫలానా రోజున పాతి పెట్టబోతున్నాను" అంటూ ప్రకటన ఇచ్చాడు:

"నేను ఈ కారుని ఎందుకు పాతిపెట్టేస్తున్నానో కూడా చెబుతాను. ఇప్పుడు వాడుకునేందుకు అయితే నాకు వేరే కార్లు ఉన్నాయి. ఇక ఒకసారి నేను చనిపోయాక, ఇంక ఈ కారు వలన నాకు ఏలాంటి ప్రయోజనమూ లేదు! అందుకని ఈ కారుని ఇప్పుడే పూడ్చిపెట్టటం అన్నివిధాలుగానూ సరైన పని!" అని ఆ ప్రకటనలో తెలియజేసాడు.

అందరూ దీన్ని గురించి రకరకాలుగా వ్యాఖ్యానించారు. కొందరు "ఈ కోటీశ్వరుడికి డబ్బులు ఎక్కువైనాయి" అన్నారు.

కొందరు "అయ్యో! డబ్బులు ఉన్నాయిగానీ వీడు బలే తెలివి తక్కువ దద్దమ్మ" అన్నారు.

"ఇంత విలువైన కారుని వృధా చేస్తున్నాడు. ఎంత పొగరో చూడండి" అన్నారు కొందరు- మొత్తం మీద ఆయన్ని ఎరిగిన వారిలో ఆయనను తిట్టుకోనివారు లేరు.

చివరికి కారును పాతిపెట్టే రోజు రానే వచ్చింది. ఆ కార్యక్రమం ఎలా జరుగుతుందో చూడటానికి జనం అంతా వచ్చారు. కారుని పాతిపెట్టడానికి చాలా గొప్ప ఏర్పాట్లు చేశాడు కోటీశ్వరుడు. వచ్చినవాళ్లందరికీ విందు ఏర్పాటు చేసాడు; కారు పట్టేంత పెద్ద గుంత త్రవ్వి ఉంచాడు; ఆ గుంతలోకి కారును దించేందుకు క్రేన్లు వగైరాలు అన్నీ ఏర్పాటు చేసాడు; కార్యక్రమాన్ని చూసేందుకు అక్కడికి చేరిన ప్రజలంతా సుఖంగా కూర్చునేందుకు ఏర్పాట్లు చేసాడు.

అందరూ గుమికూడి ఉత్సాహంతోటీ మరియు ఆశ్చర్యంతోటీ వేచి చూస్తున్నారు. అంతలోనే కోటీశ్వరుడు వచ్చాడు. అక్కడికి చేరిన ప్రజలందరినీ పేరు పేరునా పలకరించాడు. కరచాలనాలు చేసాడు. తనేదో చాలా గొప్ప పని చేస్తున్నట్లు పోజు కొట్టాడు.

దాంతో అక్కడికి వచ్చిన వాళ్ళకు అందరికీ రోషం పెల్లుబికింది. అందరూ కోపంతో ఉడికిపోతూ "అయినా మీరెందుకు, ఇంత విలువైన కారుని వృధా చేస్తున్నారు? మీరు చనిపోయాక ఇది మీకు పనికి రాకపోవచ్చు. అంత మాత్రాన దీనిని ఊరికే పాతిపెడతారా?! ఎవరికైనా ఇవ్వచ్చు కదా?! ఇంత విలువైన దానిని నాశనం చేసే అధికారం మీకు ఎవరు ఇచ్చారు?" అని అతన్ని ప్రశ్నించారు.

కోటీశ్వరుడు నవ్వి, ఇలా సమాధానం ఇచ్చాడు. "ఇంత విలువైన కారుని సమాధి చెయ్యడానికి నేనేమీ బుద్ధి తక్కువ వాడిని

కాను. దీని ద్వారా నేను అందరికీ ఒక సందేశాన్ని ఇవ్వాలనుకున్నాను.

చూసారుగా, నిజంగానే ఈ కారు చాలా విలువైనది. అయినా నేను దీన్ని పాతి పెట్టాలని నిర్ణయం తీసుకున్నందుకు మీ అందరికీ నా మీద ఎంత కోపం వచ్చింది?! కదా?!



కానీ మీరెవ్వరూ గమనించని సంగతి ఇంకోటి ఉన్నది. మన శరీరంలో ఎంతో విలువైన గుండె, కళ్ళు, ఊపిరితిత్తులు, మూత్ర-పిండాలు ఇలా ఎన్నెన్ని అవయవాలు ఉన్నాయి? ప్రతి అవయవమూ మానవ సమాజానికి ఉపయోగపడేవే! వెల కట్టలేనంత విలువ వీటిది! అయినా, మనం చచ్చిపోగానే ఈ అవయవాలన్నీ మనతోపాటే అనవసరంగా, వృధాగా మట్టిలో కలిసిపోవట్లేదా? వాటిని గురించి ఎవ్వరికీ ఏ మాత్రం చింత ఎందుకు లేదు?

కారు పోయినా, డబ్బు పోయినా మళ్లీ తిరిగి వస్తాయి; కానీ మన అవయవాలు తిరిగి రావు కదా, మరి మనం ఎందుకు, వాటిని ఇతరులకు పనికొచ్చేట్లు బహుమతిగా ఇవ్వట్లేదు?

మీకు తెలుసా? ప్రతి ఏటా కొన్ని లక్షల మంది అవయవ దానం కోసం ఎదురు చూస్తున్నారు. మనం అనుకుంటే వాళ్లకు చాలా సాయం చేయచ్చు! ఆలోచించండి! అవయవదానం చెయ్యడానికి నిర్ణయించు-కోండి. అవయవ దానం ఎంత అవసరమో అందరూ గుర్తించేలా చేసేందుకే నేను ఈ నాటకం ఆడాను!" అన్నాడు.

లాయర్ : హత్య చేసిన కత్తి మీద నీ వేలిముద్రలు ఉన్నాయి- కాబట్టి నువ్వు నేరస్తుడివి.
ముద్దాయి : నేను M.A చదివాను సార్, వేలిముద్రలు వేయాల్సిన ఖర్మ నాకేంటి?!






# ఇద్దరు స్నేహితులు

*మూలం: ఓ.హెన్రీ వ్రాసిన కథ- 'ఆఫ్టర్ ట్వెంటీ ఇయర్స్'*

*తెలుగులో సంక్షిప్త కథనం: సాత్విక్ నీహార్, 6 వ తరగతి, వికాస విద్యావనం, పోరంకి, కృష్ణాజిల్లా.*

13 సంవత్సరాల క్రితం ఇద్దరు స్నేహితులు విడిపోయారు. వాళ్ళు "మళ్ళీ ఇదే చోటుకి పదమూడు సంవత్సరాల తరువాత వచ్చి కలుసుకుందాము" అని అనుకున్నారు.

పదమూడేళ్ళ తరువాత, ఒక రోజు రాత్రి పది గంటల సమయంలో ఓ యువకుడు ఒక మైదాన ప్రాంతంలో నిలబడి ఉన్నాడు. అతని పేరు మదన్. అతను ఎవరికోసమో వేచి చూస్తున్నాడు. చీకటిలో నిలబడి ఉన్నాడేమో, అతని ముఖం సరిగ్గా కనిపించటం లేదు.

అంతలో అక్కడికి ఒక పోలీసు వచ్చాడు. అతను డ్యూటీలో ఉన్నట్లు, పోలీసు డ్రస్ వేసుకొని ఉన్నాడు. నేరుగా ఆ యువకుడి దగ్గరకు వెళ్ళి పలకరించాడు. 'ఇంత చీకటి వేళ, ఇక్కడ ఏం చేస్తున్నావ'ని అడిగాడు.

యువకుడు తన స్నేహితుడు కైలాష్ గురించి, పదమూడు సంవత్సరాల తర్వాత కలుద్దామని తాము అనుకున్న సంగతీ చెప్పాడు.




కైలాష్ కోసం చూస్తున్నాను. 'నా మిత్రుడు ఎక్కడున్నా ఇవాళ్ల తప్పకుండా వస్తాడు ఇక్కడికి' అన్నాడు. తరువాత తన గురించి కూడా చెప్పాడు. తను ఆ ఊరిని వదిలి పెట్టాక ముంబాయి చేరుకున్నట్టు, అక్కడ సిటీలో వ్యాపారాలు చేసి బాగా డబ్బు సంపాదించినట్లు వివరంగా చెప్పాడు. పోలీసతను అక్కడే మరి కొంత సేపు నిలబడి, యువకుడికి 'గుడ్ నైట్' చెప్పి వెళ్ళిపోయాడు.

కొద్ది సేపటికి అక్కడికి మరొక వ్యక్తి వచ్చి, నీడలో నిలబడిన యువకుడిని పలకరించాడు 'మదన్! ఎలా ఉన్నావు?!' అంటూ.

ఐతే యువకుడు అతన్ని గుర్తు పట్టలేదు. 'ఎవరు మీరు?' అని అడిగాడు.

"నేనేరా, కైలాష్‌ని" అన్నాడు ఆ వచ్చిన వ్యక్తి.

కానీ అతని ముఖం మీద పడుతున్న వెలుగు వల్ల అతను కైలాష్ కాదు అని గుర్తు పట్టిన మదన్ వెంటనే పారిపోయేందుకు ప్రయత్నించాడు.

కానీ ఆ మనిషి గబుక్కున అతని మీదికి దూకి అతన్ని బంధించి బేడీలు వేసాడు. "బొంబాయిలో అనేక సంవత్సరాలుగా చట్టవిరుద్ధమైన పనులు చేస్తున్నందుకు గాను నిన్ను అరెస్టు చేస్తున్నాను" అంటూ, తన జేబులోంచి ఒక ఉత్తరాన్ని తీసి మదన్‌కు ఇచ్చాడు.

ఉత్తరంలో ఇలా రాసి ఉంది. 'మిత్రమా, మదన్! ఇందాకనే మనం మాట్లాడుకున్నాం.

పదమూడేళ్ల తర్వాత కలుద్దామనుకున్నాం; కలిసాం, చూసావా?! నువ్వు చేస్తున్న పనులకు గాను ముంబాయ్ పోలీసులు నీ గురించి చాలా కాలంగా వెతుకుతున్నారు. నేను కూడా పోలీసునే. 'నా మిత్రుడే అ దొంగ' అని ఇందాక నీతో మాట్లాడుతున్నప్పుడే గ్రహించాను. అయినా నిన్ను నా చేతులతో బంధించలేక వేరే ఇన్స్‌పెక్టర్ గారిని పంపిస్తున్నాను. అన్యథా భావించక లొంగిపోగలవు.

నీ ప్రియమిత్రుడు కైలాష్.

ఉత్తరం చదివి స్మగ్లర్ మదన్ నోరు వెళ్ళబెట్టాడు. 

స్వాగతం!

కొత్తపల్లి పుస్తకంలో పిల్లల రచనలకు ప్రాధాన్యత ఉంటుంది. ఈ పుస్తకంలో దాదాపు సగం కథలు పిల్లలు రాసినవి; మిగిలినవి పిల్లలకోసం పెద్దలు రాసినవి. బొమ్మలు వేసిన వాళ్ళు కొందరు యువకులు, కొందరేమో హైస్కూళ్ళలో చదువుతున్న పిల్లలు.

'పిల్లలు రాసి పంపే కథల్లో తప్పుల్ని సరిదిద్ది, వాటికి తగిన బొమ్మలు వేయించి ప్రచురించటం, ఆ కథల్ని ఇంకా చాలా మంది పిల్లలకు అందించటం' అనే పనిని కొత్తపల్లి గత పదేళ్ళుగా చేస్తున్నది. చాలా మంది పిల్లలకు, పెద్దవాళ్ళకు కూడా అలా మాతృభాష పట్ల మమకారం కలిగేట్లు చేయగలిగింది కొత్తపల్లి.

పెరిగే వయస్సులో ఉన్న పిల్లల వికాసం సక్రమంగా ఉండేందుకు అవసరమయ్యే సామాజిక విలువలను ఆవిష్కరించే కథలు, జనపదాల్లో వాడుకలో ఉన్న కథలు, వివిధ దేశాల కథలు, పాటలు, పద్యాలు, కవితలు, నవ్వొచ్చే కథలు, జోకులు ఇలా పిల్లలకు ఏవేవి ఇష్టమౌతాయో అలాంటి సాహితీ ప్రక్రియలు అన్నిటికీ వేదికవుతున్నది కొత్తపల్లి.

వీటి ప్రచురణలో పూర్తిగా ఓపెన్ సోర్సు ఉపకరణాలను వాడటం, అందరూ ఉచితంగా చదువుకునేట్లు వీటిని ఇంటర్నెట్‌లో పెట్టటంతోపాటు, కొన్ని ప్రతుల్ని ఇలా అచ్చు వేసి పుస్తకాలుగా అందించటం మాకు ఇష్టం. వ్యాపార దృష్టితో కాకుండా అందరి మేలూ కోరి చేసే ఈ పనిలో మీరూ ఏదో ఒక రూపంగా పాలుపంచుకుంటే బాగుంటుంది. రండి- పిల్లల కథల ప్రపంచంలోకి అడుగు పెట్టండి!!



# విధివ్రాత

*రచన: కె.వి.చంద్రిక, పదవతరగతి, జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, వేపరాల, కడప జిల్లా.*

వంగదేశాన్ని ఒకప్పుడు అనంగుడు అనే రాజు పరిపాలించే వాడు. ఆ సమయంలో అక్కడి ఓ పల్లెటూళ్ళో హనుమంతు అనే విద్వాంసుడొకడు ఉండేవాడు. 'జాతకాలు చూడటంలో ఆయనకి ఎదురే లేదు' అని చెప్పుకునేవారు.

ఒకరోజున హనుమంతు యధాలాపంగా పుస్తకాలు సవరిస్తూంటే అనంగ మహారాజు జాతక చక్రం కనబడింది. తమ రాజుగారి జాతకం ఎలా ఉందో చూద్దామని లెక్కలు వేసిన హనుమంతుకు ఆ జాతకంలో పెద్ద దోషం ఒకటి కనబడ్డది: 'మరొక నాలుగు ఐదు రోజుల్లో రాజుగారికి ప్రాణగండం ఎదురౌతుంది. ఆయన దాని నుండి

తప్పించుకునేందుకు ఎలాంటి అవకాశాలూ లేవు'



సంగతి తెలిసాక ఇక హనుమంతు ఊళ్ళో నిలువలేపోయాడు. ఈ విషయాన్ని వెంటనే రాజుగారికి తెలియజేయాలని బయలుదేరాడు. మూడు రోజులపాటు నడిచి, ఎన్నో అవస్థలు పడి, చివరికి రాజధానికి చేరుకున్నాడు.

ఉదయాన్నే రాజుగారి ఆస్థానానికి వెళ్ళాడు. "రాజుగారు ఇక్కడ లేరు. దేశాటనలో ఉన్నారు" అన్నారు ద్వారపాలకులు.

"రాజుగారితో ముఖ్యమైన విషయం చెప్పాలి" అన్నాడు హనుమంతు.

"ఆ ముఖ్యమైన విషయం ఏమిటో మాకే చెప్పు" అని నవ్వారు ద్వారపాలకులు.

అయితే అదే సమయంలో ఒక మంత్రిగారు వచ్చారు అక్కడికి.

హనుమంతు మంత్రిగారితో మొరపెట్టు-కున్నాడు- "రాజుగారితో నేనొక ముఖ్యమైన విషయం మాట్లాడాలి. ఆలస్యం ప్రమాదానికి దారి తీస్తుంది!" అని.

మంత్రి హనుమంతుని ఊరడించి సంగతి కనుక్కొని, ఆయన్ని మహా మంత్రి దగ్గరికి తీసుకెళ్ళాడు.

మహామంత్రి అనేక రాచకార్యాలలో వ్యస్తంగా ఉన్నాడు. 'హనుమంతు కేవలం బహుమానాల మీది ఆశతో, ప్రశంసల కోసం ఊరికే ఇలా చెబుతున్నాడు' అని మహామంత్రికి అనిపించింది. "ముందు ఇతన్ని చెరసాలలో బంధించండి. అసలు విషయం ఏంటో చెప్పించండి. రేపటి వరకూ ఇతను అదే మాట మీద ఉంటే, అప్పుడు మన ఆస్థాన జ్యోతిష్యుడిని రమ్మందాం" అన్నాడాయన.

భటులు తక్షణం హనుమంతుని చెరసాలలో బంధించారు. అనేక రకాలుగా ప్రశ్నించారు అతన్ని.

ఎన్ని రకాలుగా అడిగినా హనుమంతు తను చెప్పిందే మళ్ళీ మళ్ళీ చెబుతున్నాడు తప్ప మాట మార్చట్లేదు. "ఆలస్యం ప్రమాదానికి దారి తీస్తుంది. బాధ్యత గలవారిని ఎవరినైనా రమ్మనండి" అంటాడు; "అసలైనా నాదగ్గరికి వచ్చినవాళ్ళ జాతకాలు చూసుకొని హాయిగా ఉండక, నాకెందుకు వచ్చింది ఈ ఖర్మ? అసలు రాజుగారి జాతకాన్ని చదివి చెప్పేందుకు అస్థాన జ్యోతిష్యులు ఉంటారు కదా?" అని వాపోతాడు హనుమంతు.

మరునాడు ఉదయం అస్థాన జ్యోతిష్యుడికి కబురు వెళ్ళింది. "ఇక్కడెవరో ఒకతను వచ్చాడు పల్లె నుండి. రాజుగారి గురించిన ముఖ్యమైన విషయం ఏదో చెబుతాడట. మీరు రావాలి కారాగారం దగ్గరికి" అని.

జ్యోతిష్యుడు "నేను ఒక్క ఐదు నిముషాల్లో వస్తున్నాను- ఆలోగా ఆయన్ని జాగ్రత్తగా చూసుకోండి" అని వెనక్కి కబురు పెట్టి గబగబా ఆస్థానానికి చేరుకున్నాడు.

అంతలోకే వార్తాహరుడొకడు దుర్వార్తను మోసుకొచ్చాడు: రాజుగారు ప్రజల కష్టాలు విచారించే క్రమంలో రాజ్య సరిహద్దులో బస చేసారు. అంతకు ముందు రోజు రాత్రి ఆకస్మికంగా శత్రుసైన్యం జరిపిన దాడిలో రాజుగారు వీరమరణం చెందారు!



అంత:పురంలోని వారంతా బావురుమన్నారు. "మనం బంధించిన ఆ పండితుడిని వెంటనే సగౌరవంగా రప్పించండి" అన్నాడు అస్థాన జ్యోతిష్యుడు. భటులు వెళ్ళి చూసే సరికి కారాగారంలో హనుమంతు కూడా చనిపోయి ఉన్నాడు! అక్కడ రాజు చనిపోయిన కొద్దిసేపట్లోనే ఇక్కడ ఈయనా

మరణించి ఉంటాడన్నారు వైద్యులు.



"రాజుగారి ప్రాణాలకు గండం ఉందని నాకూ తెలుసు. అయితే ఈ విషయాన్ని వెలువరించిన వారికి కూడా ప్రాణగండం ఉందని తెలుసుకున్నాక, సంగతిని వెలిబుచ్చకుండా సమస్యను ఎలా పరిష్కరించటమా అని ఆలోచిస్తూ ఉండిపోయాను. అంతలోనే ఈ ఘోరం జరిగిపోయింది" అని ఆస్థానజ్యోతిష్యుడు వాపోయాడు.

"పాపం అందరి జాతకాలూ చూసిన హనుమంతు తన జాతకాన్ని తను చూసుకోలేకపోయాడు- విధి వ్రాత ఎలా ఉంటే అలా జరుగుతుంది" అన్నారు మంత్రిగారు, తనూ విచారపడుతూ, 'రాజుగారి వారసుడిని ఎలా ఎన్నుకోవటమా' అని ఆలోచిస్తూ.

**పొడుపు కథలు**

1. అక్క ఇంట్లో దీపం పెడితే, చెల్లెలింటిలో వెలుతురొస్తుంది. ఏమిటది?
2. అంగట్లో కొంటారు, ముందర పెట్టుకొని ఏడుస్తారు. ఏంటది?
3. అంగట్లో వుంటాను, అంగీ ఇంట్లో విప్పుతాను, నూతిలో దూకుతాను. ఎవరిని నేను?
4. అంగుళం గదిలో అరవై మంది నివాసం! ఏమా గది, ఎవరా మంది?
5. అగ్గి మీద బావి, బావిలోని నీళ్ళలో తేలే కప్ప. ఏంటి ఇదంతా?

(పేడపొయ్యి, ఉల్లిపాయ, అరటిపండు, అగ్గిపెట్టె, నూనెలో వేగే అప్పడం)

*సౌజన్యం :"పిల్లల కోసం పొడుపు కథలు" డా. పత్తిపాక మోహన్*



# బహుముఖ ప్రజ్ఞ

*"కొందరు తమకు తెలిసిన విద్యలే గొప్పవని, ఇతరుల విద్యలు తక్కువ అని వాదిస్తారు కానీ, నిజానికి ఏ విద్య గొప్పదనం దానిది. దేనినీ తక్కువగా చూడరాదు. గెలుపు-ఓటములు అంటూ ఏవీ విద్యలకు ఉండవు. ఓటమి ఏనాడూ విద్య తప్పు కాదు: నేర్చిన వ్యక్తి నైపుణ్యంలో లోపం ఉందని మాత్రమే అది సూచిస్తుంది. అతనికి ఆ విద్యను ఉపయోగించటం సరిగా రాదని, దానిలోని మెళకువలు అతనికి సరిగా తెలియవని, మనం తెలుసుకోవాల " అంటూ తాతగారు ఈ కథని రాసి పంపారు. నిజమే కదా!*

*రచన: చొప్పా వీరభద్రప్ప, అనంతపురం*

విజయదుర్గాన్ని జయేంద్రుడు అనే ప్రభువు పాలించే సమయంలో సైనికులను ఎంపిక చేసుకోవటంలోను, యుద్ధ శిక్షణను ఇవ్వటంలోను విజయదుర్గానికి భరత ఖండంలోనే గొప్ప పేరు ఉండేది. ముందుగా బలమైన యువకులను తనదైన శైలిలో

ఎంపిక చేసుకునేవాడు జయేంద్రుడు. ఆ తర్వాత వారికి ఖడ్గ యుద్ధంలోను, గదా యుద్ధంలోను, విలు విద్యలోనూ శిక్షణని-ప్పించేవాడు. కనీసం ఒక విద్యలోనైనా అద్భుత ప్రతిభ కనబరచిన వారినే తన సైన్యంలో చేర్చుకునేవాడాయన.



అంతే కాక వాళ్లకు ప్రతి యేడాదీ పోటీలు పెట్టించి, వాళ్ళు తమ విద్యని ఎంత మెరుగు పరచుకున్నారో పరిశీలిస్తుండేవాడు; ఆ పోటీలలో గెలిచిన వాళ్లకు రకరకాల బహుమతులనిచ్చి సత్కరించేవాడు.

ఒకసారి ఆ పోటీలన్నిట్లోనూ 'పురుషోత్తం' అనే యువ సైనికుడే మేటిగా నిలచాడు. జయేంద్రుడు అతనిని ప్రత్యేకంగా అభినందించటమే కాకుండా, తనతో బాటు అతన్ని కూడా రథంలో కూర్చోబెట్టుకొని వేటకు తీసుకెళ్ళాడు.

అయితే, ఆనాటినుండీ పురుషోత్తమునిలో గర్వం తలెత్తింది. తానే గొప్ప వీరుడనని విర్రవీగసాగాడు. తనకంటే పై అధికారులపట్ల అవిధేయతతో కూడా ప్రవర్తించటం మొదలుపెట్టాడు. పురుషోత్తముడి పొగరు-మోతుతనాన్ని మహామంత్రి కూడా అనేక పర్యాయాలు గమనించాడు. 'సైన్యంలో అవిధేయులకు తావు ఉండరాదు. బయటివారికి ఎల్లవేళలా సైన్యపు సమైక్యతా శక్తి అభివ్యక్తం అవ్వాలి. సైనికులు ఎవరికివారుగా తామే గొప్ప అనుకుంటే ఇక ఆ సైన్యం శత్రువులకు సైతం చులకనైపోతుంది. అందువల్ల అలాంటి వారి పొగరును మొగ్గలోనే త్రుంచివేయాలి'. పురుషోత్తముడి అహంకారాన్ని తగ్గించి బుద్ధి

చెప్పాలనుకున్న మహామంత్రి అతనిపై ప్రత్యేక దృష్టి ఉంచాడు.



విజయదుర్గపు సరిహద్దు అడవుల్లో ప్రసిద్ధి చెందిన దేవాలయం ఒకటి ఉండేది. విజయదుర్గ వాసులే కాక, పొరుగు రాజ్యాల నుండి కూడా అనేకమంది భక్తులు వచ్చి దేవుడిని దర్శించుకునేవాళ్ళు. రాజ్యాలమధ్య సద్భావనకు, సత్సంబంధాలకు ఆధారంగా నిలచిన ఆ దేవాలయంలో ఆయుధ ధారులైన సైనికులెవ్వరినీ ఉంచేవాళ్ళు కాదు. విజయదుర్గపు రాజులంతా ఆ పరంపరకు కట్టుబడి ఉండేవాళ్ళు.

అయితే అకస్మాత్తుగా ఆ దేవాలయంలో దొంగలు పడి, విలువైన నగల్ని, పూజా సామగ్రిని మొత్తంగా దోచుకుపోయారు!

వెంటనే మహామంత్రి, సేనాపతి ఇద్దరూ భారీ సైనిక దళాలను వెంటబెట్టుకొని పోయి, దేవాలయం చుట్టు ప్రక్కల అడవులన్నీ గాలించి, దొంగల్ని పట్టి బంధించటమే కాక, వస్తువులన్నిటినీ తెచ్చి ఖజానాకు జమ చేసారు. "అయితే ఇక మీద దేవాలయానికి సైనిక భద్రత కల్పించటం అవసరం ప్రభూ!" అని విన్నవించుకున్నారు.

కానీ రాజు జయేంద్రుడు అందుకు సమ్మతించలేదు. "మా వంశంలో ఎవ్వరూ చేయని పని ఇది- దేవాలయంలోకి సైనికులకు ప్రవేశం లేదు. పవిత్రతకు, శాంతికి ఆలవాలంగా నిలువవలసిన దేవాలయంలోకి ఆయుధాలు ప్రవేశించకూడదు" అన్నాడు.

"ఆయుధాలు ఉండవు మహారాజా! ఆయుధాలు ధరించని సైనికులు మాత్రమే ఉంటారు" అన్నాడు సేనాపతి.

మహారాజు నవ్వాడు: "ఆయుధాలు లేని సైనికులు ఎవరికి రక్షణ కల్పిస్తారు?" అంటూ.

మహామంత్రి కల్పించుకొని "మేం దాన్ని గురించి ఆలోచించాం ప్రభూ! ఆయుధాలతో ప్రమేయం లేని చీనా దేశపు యుద్ధ విద్యలు కొన్ని ఉన్నాయి. తమరు సరేనంటే మన రాజ్యపు యువకులు ఒక పది మందికి మేం అలాంటి శిక్షణ నిప్పిస్తాము" అన్నాడు.

"అవి ఊరికే పేరుకు మాత్రమే. అట్లాంటి విద్యలు సైనికుల ఆత్మ రక్షణకే సరిగ్గా ఉపయోగపడవు- ఇంక దేవాలయాన్ని అవేమి రక్షిస్తాయిలే!" అన్నారు రాజుగారు చటుక్కున. అయినా మంత్రి-సేనాపతుల ఉత్సాహాన్ని నీరుకార్చటం ఇష్టం లేక "సరే! కానివ్వండి! చూద్దాం. అయితే ఆరు నెలల తర్వాత పరీక్ష పెడతాం వాళ్లకు!" అని అనుమతించారు.

వెంటనే మహామంత్రి ప్రకటనలు జారీ చేసి, పది మంది మెరికల్లాంటి యువకులను ఎంపిక చేసుకున్నాడు. సేనాపతి స్వీయ నేతృత్వంలో వారికి ఆయుధాలు లేకుండా పోరాడే విద్యలలో శిక్షణ ఇవ్వబడింది.

చూస్తూండగానే ఆరు నెలలు గడిచాయి. ఒకనాడు మహామంత్రి "ప్రభూ! తమరు ఇక మన ఆయుధ రహిత రక్షా దళాన్ని పరీక్షించవచ్చు. వారి శిక్షణ ఒక స్థాయికి వచ్చింది" అని తెలియపరచాడు. వాళ్లని పరీక్షించటం కోసం రాజుగారు తమవెంట తీసుకువచ్చే యోధులలో పురుషోత్తం ఉంటాడని మహామంత్రికి తెలుసు. "ఇక పురుషోత్తంకి కనువిప్పు కలిగే రోజు దగ్గర పడింది" అనుకొని నవ్వుకున్నాడాయన.

అందరూ దేవాలయ ప్రాంతానికి చేరారు.

అక్కడ ఒక మర్రి చెట్టు నీడలో ఇరవై-ఇరవై ఒక్క సంవత్సరాల యువకులు కొందరు నిలబడి ఉన్నారు. పల్లెల్లో వాళ్ల మాదిరే పంచెలు కట్టుకొని, గుండు చేసుకొని, పిలకలు పెట్టుకొని ఉన్నారు వాళ్ళు.

వాళ్లలో ఒక పిల్లవాడిని ముందుకు రమ్మన్నాడు రాజు. అతడు వచ్చి అందరికీ నమస్కరించాడు.



కండలు తిరిగిన సైనికుడిని ఒకడిని ముందుకు పిలిచారు రాజుగారు- "నువ్వు ఈ పిల్లాడిని ఓడించాలి.." అన్నారు.

అతను సిగ్గు పడుతూ, "ప్రభూ! పిల్లవాడితో..?" అన్నాడు.

"శత్రువు ఎవరైనా పోరాటం పోరాటమే!" అన్నారు రాజుగారు కఠినంగా.

"క్షమించండి మహారాజా! తమరి ఆజ్ఞను శిరసా వహిస్తాను" అంటూ అతను ఆ బాలకునితో ద్వంద్వ యుద్ధానికి తలపడ్డాడు. ఏం జరిగిందో తెలీనే లేదు. మరుక్షణంలో సైనికుడు మట్టి కరచి, మెడ పట్టుకొని మూలుగుతున్నాడు!

రాజుగారు "శహభాష్!" అని చప్పట్లు కొట్టి, పురుషోత్తముడిని పిలిచారు. "నీకు సరిజోదు, వీడు" అని ఆ పిల్లవాడిని చూపించారు.

పురుషోత్తం మీసాలు మెలివేసి, "ప్రభూ! తమరు నన్ను అవమానిస్తున్నారు. ఇతని శరీరంలో పిడికెడు కండలేదు. చేతుల్లో ఒక్క ఆయుధం కూడా లేదు. ఇంకా మీసాలు మొలవనే లేదు. వీడా, నాకు సరి జోడు?! నేను కత్తి పట్టి నిలిస్తే, ఒక్క వేటుతో ఇతన్ని రెండు ముక్కలు చేస్తా. గద అవసరం లేదు- నా ఒక్క పిడిగుద్దుతో ఇతని తల టెంకాయ మాదిరి పగిలిపోతుంది. ఇక నేను వేసే బాణాల ధాటికి వీడి శరీరం తూట్లు

పడిపోతుంది" అన్నాడు.

"నువ్వు నీకు నచ్చిన ఏ ఆయుధమైనా వాడచ్చు- ఈ కుర్రవాడిని ఓడిస్తే చాలు" అన్నాడు మహామంత్రి. "అవునవును" అన్నారు రాజుగారు.

రాజుగారి ఆదేశంతో పురుషోత్తం ఆ బాలవీరునితో పోరాటానికి సిద్ధపడ్డాడు.

పురుషోత్తం అతన్ని కత్తితో కొట్టజూచాడు. ఆ బాలకుడు అతి చాకచక్యంతో ఉన్నవాడు ఉన్నట్లే క్రిందికి వంగి లేచాడు. పురుషోత్తం అతన్ని కత్తితో ఎన్నిసార్లు పొడవచూచినా బాల యోధుడు కుడి ఎడమలకు వంగటం, లేదా గాలిలో పైకి ఎగిరి, గిరటాలు కొట్టి తిరిగి నిటారుగా నిలబడడం చేస్తున్నాడు. పురుషోత్తం గదను ఉపయోగించినా ఏమాత్రం ప్రయోజనం లేకపోయింది. గద ఆ పిల్లవాడి శరీరాన్ని కనీసం తాకను కూడా తాకలేదు. క్రమంగా పురుషోత్తం అలసిపోయాడు. ఇదే అదునుగా ఆ పిల్లవాడు చాకచక్యంకొద్దీ పైకెగిరి, తన కాలి మడమతోటీ, పాదాలతోటీ, పిడికిలి గుద్దులతోటీ పురుషోత్తం ఎదపైనా, తలపైనా, వీపుపైనా మహావేగంతో మోదటం మొదలు పెట్టాడు. వరసగా పడుతున్న ఆ దెబ్బలకు దిక్కు తోచలేదు పురుషోత్తముడికి. అసలు ఆ వీరుడు తనకు ఎదురుగా ఉన్నాడో, ప్రక్కన ఉన్నాడో, వెనుక ఉన్నాడో కూడా ఊహించలేనంత వేగంగా తిరుగాడుతూంటే, ఇక ఏమీ చేయలేని నిస్సహాయతలో పురుషోత్తం చేతులు మోడ్చి నేలకొరిగాడు.



రాజుగారు ఆశ్చర్యంతో "మహామంత్రీ! మన

సాంప్రదాయక యుద్ధ విద్యల్ని అన్నిటినీ మించిన ఈ విద్యను ఏమంటారు? నువ్వన్న చీనాదేశపు యుద్ధ విద్య ఇదేనా? దీనిని మీకెవరు నేర్పారు?" అని ప్రశ్న వెనుక ప్రశ్న సంధించాడు.

"వీటిలో పలు రకాలు ఉన్నాయి- ఈ విద్యలని 'మార్షల్ విద్యలు' అంటారు ప్రభూ. కరాటే, కుంగ్‌ఫూ, జూడో వంటి పేర్లతో ఇవి మన తూర్పు దేశాలలో ఔన్నత్యాన్ని పొందాయి. వస్తుత: ఏ విద్యా కూడా తనంతట తాను గొప్పదీ కాదు; తక్కువదీ కాదు ప్రభూ, తమరికి తెలియనిదేమున్నది? యోధునికి ఔన్నత్యమే ఆ విద్యలో ప్రకాశిస్తుంది. యోధుని సాధనవల్ల విద్య పరిపుష్టం అవుతుంది; యోధుని గర్వం విద్యని హరిస్తుంది" అన్నాడు మహామంత్రి, ఓరకంట పురుషోత్తముడిని చూస్తూ. "తమరు ఈ పదిమంది కుర్రవాళ్ల మీదికి ఇరవైమంది సైనికులను పంపండి ప్రభూ! వీరి ప్రజ్ఞను ప్రత్యక్షంగా చూడవచ్చు" అని జోడించాడు.

రాజుగారి ఆజ్ఞతో ఇరవైమంది సైనికులు, కొందరు గదలు ధరించి, కొందరు ఖడ్గాలు ధరించీ ముందుకు దూకారు. కొందరు తమ ధనుస్సులనుండి బాణాలు వేయటం మొదలెట్టారు. మార్షల్ విద్యలు నేర్చిన యువయోధులంతా వీర విహారం చేసారు. కొద్ది సేపట్లోనే మైదానం అంతా ఖాళీ అయింది: ఇరవై మంది సైనికులూ మట్టి కరచారు!

రాజుగారు యువకుల్ని మెచ్చుకొని, దేవాలయ రక్షణ కోసం వారిని నియోగించేందుకు అనుమతించారు.

'ఒక దెబ్బకు రెండు పిట్టలు' అన్నట్లు, మహామంత్రి ఒక వైపున పురుషోత్తముడి అహాన్ని ఓడించాడు; మరో వైపున దేవాలయపు సమస్యనీ తీర్చాడు. రాజుగారి మెప్పు నందాడు. బుద్ధి శాలుల ప్రతిభ బహుముఖంగా ఉంటుంది కదా!

ఆపదల్లో ధైర్యం ప్రదర్శించగలిగేవాడే ధీరుడు




# కలిసొచ్చిన అదృష్టం

*రచన: ఇశాక్, ఇంటర్మీడియట్, రాయలచెరువు, యాడికి మండలం, అనంతపురం జిల్లా.*

రాయల చెరువులో నివసించే లక్ష్మయ్య అదృష్టవంతుడు అనుకునేవాళ్ళు అందరూ. పది ఎకరాల చేను ఉండేది అతనికి. లక్ష్మయ్య చాలా మంచివాడు. ఎదురు పడిన శత్రువునైనా ఇంట్లోకి పిలిచి మర్యాదలు చేసేంత మంచివాడు.

ఆ సంవత్సరం అందరిలాగానే లక్ష్మయ్య కూడా తన పొలంలో వేరుశనగ విత్తనాలు వేసేందుకు తయారయ్యాడు. చేనును బాగా దుక్కి చేసి, విత్తనాలు వొలిచి పెట్టుకొని, వర్షం కోసం ఎదురు చూడసాగాడు.

కానీ అంతకు ముందులాగే ఆ ఏడాది కూడా అదనులో వర్షాలు పడలేదు. 'పడతాయిలే' అని ధైర్యం చేసి విత్తిన రైతులందరూ ఘోరంగా నష్టపోయారు. చాలా పొలాల్లో వేరుశెనగ మొలకలు కూడా రాలేదు. గ్రామంలో అందరూ అప్పులపాలయ్యారు.

"త్వరపడి విత్తకపోవటం మంచిదైంది. అయినా ఈ సంవత్సరం అంతా చేన్లను

బీడుగా వదిలితే ఎలాగ?" అని ఆలోచిస్తూ విచారంలో మునిగాడు లక్ష్మయ్య.



ఆరోజు రాత్రి చీకటి పడుతుండగా ఒక ముసలాయన లక్ష్మయ్య ఇంటి తలుపు తట్టాడు. "పెద్దయ్యా! మాది కొమ్ముల తాండా. సంతకని బయలుదేరి వస్తుంటే బండి చక్రం విరిగి, ఆలస్యమైపోయింది. అటూ ఇటూ కాకుండా ఇరుక్కుపోయాను. తమరు సరేనంటే ఇక్కడ ఈ రాత్రికి పడుకొని, రేపు ఉదయంగా మళ్ళీ మా ఊరికి నేను బయలుదేరి పోతాను" అని.

"దానిదేముంది, పశువుల్ని అక్కడ కట్టేసి, నువ్వు లోనికి రా, రొంత బువ్వ తిందువు మాతోటి" అని అతన్ని ఆహ్వానించిన లక్ష్మయ్యకు మాటల సందర్భంలో మరిన్ని వివరాలు తెలిసాయి: అతను అంతకు క్రితం పండించిన కొర్రలు అమ్ముకునేందుకు వచ్చాడు సంతకు. అతని దగ్గర ఐదు బస్తాల కొర్రలు ఉన్నాయి.

ఆ రోజు రాత్రి నిద్రపోబోతుండగా లక్ష్మయ్యకు ఓ ఆలోచన వచ్చింది. "వేరుశెనగకు అదను ఎలాగూ తప్పిపోయింది. ఇప్పుడు తన చేనులో కొర్రలు వేస్తే ఎలా ఉంటుంది? దేవుడు నా కోసమే పంపించినట్లున్నాడు ఇతన్ని! ఒక్క వాన పడితే చాలు- కొర్రలు పండిపోతాయి. వాటికి పెద్ద రేటు ఉండదు; కానీ చేనును బీడుగా వదలటం కంటే అదే మంచిది కద!"

తెల్లవారాక, ముసలాయన చెప్పిన రేటుకు ఐదు బస్తాల కొర్రలూ కొనేసి అతన్ని సంతోషంగా ఇంటికి పంపించాడు లక్ష్మయ్య.

నిజంగానే అదృష్టం ఆ ముసలాయన రూపంలో వచ్చిందేమో మరి- ఆ రోజు సాయంత్రమే వర్షం మొదలైంది. ఎక్కడో

వచ్చిన తుఫాను వల్ల రాయల చెరువులో నింగీ నేలా ఏకమయ్యేట్లు వానలు పడ్డాయి. ఊళ్లో పొలాలన్నీ చెరువులయ్యాయి.

లక్ష్మయ్య ఎంతో సంబరపడిపోయాడు. "వేరుశనగ విత్తుదామా? వరి వేద్దామా?" అని అతనికిప్పుడు రకరకాల ఆలోచనలు వచ్చాయి.




అయితే మరొకవైపున ముసలాయన ముఖం గుర్తుకొస్తూ ఉండింది. చివరికి "ఏమైనా సరే! కొర్రలే విత్తుదాం. దేవుడు నాకోసం ఆ వాట్నే పంపించాడు" అని తన చేన్లో అంతటా కొర్రలు చల్లేసాడు, ఎవ్వరు ఏమన్నా వినకుండా. పొలాలున్న రైతులందరూ గబగబా వరి నారు కొనుక్కొచ్చి నాటారు.

అయితే ప్రకృతి రైతును మళ్ళీ మోసమే చేసింది. ఆ సంవత్సరం ఇక వానలు పడలేదు. అదను తప్పిపోయాక వేరుశెనగ వేసిన రైతుతో బాటు, వరి నాటిన రైతులంతా భారీగా నష్టపోయారు. లక్ష్మయ్య పొలంలో మటుకు కొర్రలు విరగ కాసాయి.

"అయినా ఏం లాభం? కొర్రలు పశువుల మేతకు తప్ప ఇంకెందుకూ పనికి రావు" అన్నారు అప్పటికే నష్టపోయిన రైతులు. వాళ్ల అంచనాలను వమ్ము చేస్తూ లక్ష్మయ్య పండించిన కొర్రలు మొత్తం మంచి ధరకు అమ్ముడయ్యాయి. "తృణధాన్యాలు చక్కెర వ్యాధిని దరి చేరనివ్వవు" అని కొత్తగా కనుక్కున్న పట్టణాల వాళ్ళంతా వరసలు కట్టి మరీ కొనుక్కెళ్ళారు, లక్ష్మయ్య పంటని. ఆ ఒక్క సంవత్సరంలోనే వేరుశెనగకంటేను, వరికంటేనూ ఎక్కువ లాభాన్ని కళ్ళజూసాడు లక్ష్మయ్య, తనకు ఆ అదృష్టాన్నిచ్చిన ముసలాయనకు మనసులోనే కృతజ్ఞతలు చెప్పుకుంటూ. •




# మారిన నైజం

*ఏ మార్పుకైనా ఒక ప్రారంభం అంటూ కావాల్సిందే. ఆ ప్రారంభం ఎప్పుడూ అంతకు ముందున్న పరిస్థితికి భిన్నంగానే ఉంటుంది. ఈ కథలోలాగా కుక్కల్లో ఈ మార్పు సాధ్యమో కాదో చెప్పలేం గాని, మనుషుల్లో మటుకు ఇది సాధ్యమే అనిపిస్తుంది. మీరేమంటారు ?*

*రచన: మద్దిరాల శ్రీనివాసులు, ఉపాధ్యాయులు, త్రిపురాంతకం, ప్రకాశం జిల్లా.*

పిల్లలకు ఆకలి ఎక్కువ. టామీ కుక్కపిల్ల చిన్నగా ఉన్నప్పుడు దానికి కూడా చాలా ఆకలి ఉండేది. రోజంతా ఆహారం కోసం వెతుక్కుంటూ తిరిగేదది.

ఒక్కోసారి, ఊళ్ళో ఏ హోటల్లోంచో మంచి భోజనం వాసన గుప్పున తగిలేది. ప్రతిసారీ ఆశతో అటువైపుకు పరుగు పెట్టేది పాపం. ప్రతిసారీ విస్తరాకులు కనబడటం, గబగబా విస్తర్లలో మూతి పెట్టటం, మరుక్షణాన ఓ పెద్ద కుక్క వచ్చి మీద పడటం, ఏం జరుగుతున్నదో అర్థమయ్యే లోపలే అది ఎక్కడో దూరంగా పోయి పడటం. "కుయ్,

కుయ్" మని వణుక్కుంటూ అట్లా దూరంగా నిలబడేదది. ఆ వచ్చిన పెద్ద కుక్క తినేసాక, ఇంకా ఏమైనా మిగిలి ఉంటే టామీ అదృష్టం, అంతే.

చాలా సార్లు పెద్ద కుక్క ముగించే లోపలే మధ్య రకం కుక్కలు కొన్ని వచ్చి పడేవి. అవి వచ్చాయంటే ఇక టామీకి ఒక్క మెతుకు కూడా దక్కేది కాదు.



చిన్న కుక్కలు దొంగగానే తినాలి. ఒకసారి టామీకి అకస్మాత్తుగా ఓ మాంసం ముక్క దొరికింది. చటుక్కున అది అటూ ఇటూ చూసింది- వేరే పెద్ద కుక్కలేవీ దగ్గర్లో లేవు. దాంతో అది చటుక్కున ఆ ముక్కను నోట కరుచుకొని పరుగెత్తి, ఒక మూలగా ఆగి, దాన్ని గబగబా తినేసింది.

బ్రతుకు మెళకువలు అట్లా నేర్చుకున్నది టామీ. ఆటంకాల్ని అధిగమిస్తూ, ఓటమిని భరిస్తూ, మెల్లగా పెద్దదైంది.

ఇప్పుడు దానికి కండలు తిరిగాయి. అనుచరులు కూడా ఏర్పడ్డారు. ఎట్లాంటి యుద్ధంలో అయినా ఇప్పుడు దానిదే పైచేయి. మొదట్లో ఉండిన పెద్ద కుక్కలన్నీ ఇప్పుడు ముసలివైనాయి. చిన్న కుక్కలకు ఎట్లాగూ బలం ఉండదు! అట్లా అది తిరిగే పరిసరాల్లోని హోటళ్ళు, చెత్తకుండీలు అన్నీ ఇప్పుడు దాని సొంతం అయిపోయాయి.

సాధారణంగా దాని వయసు కుక్కలు ఏవీ పిల్ల కుక్కల్ని, ముసలి కుక్కల్ని తిననివ్వవు; ప్రశాంతంగా ఒక చోట ఉండనివ్వవు. తరిమి తరిమి సంతోషపడతాయి.

కానీ టామీ మనసు మాత్రం అట్లా కరకుబారలేదు. చిన్నతనంలో తను ఎదుర్కున్న కష్టాలు దానికి గుర్తున్నాయి- అయినా ఆ అనుభవాలకుగాను 'ఇప్పుడు ప్రతీకారం తీర్చుకోవాలి' అని దానికి అనిపించలేదు.

చిన్న కుక్కల్ని చూసినప్పుడల్లా దానికి చిన్నప్పటి తనే గుర్తుకొచ్చేది. ముసలి కుక్కల్ని చూసినప్పుడల్లా దానికి "తర్వాత ఎప్పుడో నేనూ వీటిలాగానే అయిపోతాను" అనిపించేది.




తన ఆ ఆలోచనల కారణంగా అది చిన్నపిల్లలతోటి, ముసలి కుక్కలతోటీ పోట్లాడటం మానేసింది. తనకు దొరికిన ఆహారంలోనే కొంత భాగాన్ని వాటికోసం వదలసాగింది. మెల్లగా ముసలి కుక్కలు, చిన్న కుక్కలు టామీని ఇష్టపడటం మొదలెట్టాయి.

ఒక్కోసారి దాని మంచితనాన్ని బలహీనత అనుకొని చిన్నచూపు చూసే కుర్ర కుక్కలు ఎదురయ్యేవి దానికి. అలాంటివాటితో మటుకు అది ప్రాణాలకు తెగించి పోరాడేది. వాటి మీద తన బలాన్ని నిరూపించుకునేది.

రాను రాను టామీకి తన పద్ధతి మంచిది అన్న నమ్మకం కలిగింది. ఇప్పుడు అది తనకు ఎక్కడ ఆహారం దొరికినా, మిగతా కుక్కలన్నిటినీ పిలవటం, కలిసి తినటం మొదలుపెట్టింది. బలం ఉన్న కుక్కలు బలహీనుల్ని కరవబోతే కూడా తను అడ్డుకొనసాగింది. ఆ క్రమంలో దాని అనుచరులు కూడా అదే పని చేయసాగాయి.

అలా ఉన్నదాన్ని తోటి కుక్కలతో పంచుకొని తింటూ పెద్దయిన క్రొత్త తరం కుక్కలకు అట్లా పంచుకొని తినటమే అలవాటయింది!

ఇప్పుడు ఆ ఊరి కుక్కలు ఆహారం కోసం అసలు కొట్లాడుకోవు! దొరికిన ఆహారాన్ని అన్నీ కలిసి తింటాయి! వాటి నైజమే మారిపోయింది! 



# రాతిపులుసు

*రష్యన్ జానపద కథఇంతకీ రాతి పులుసు వేటితో తయారైందబ్బా?!*

*అనుసరణ: శ్రీ కె.వి. కృష్ణారావు, కర్నూలు.*

రష్యన్ సైనికులు ముగ్గురు, ఎక్కడో కొండల్లో ఉన్న సైనిక శిబిరంలో తమ పనులు ముగించుకుని, సెలవుల మీద ఊరికి బయలుదేరారు. అందులో ఒకరు సార్జంట్, మరో ఇద్దరు పీటా, షాషాలు. అట్లా నడిచీ నడిచీ చివరికి అడవిలోంచి బయటపడి, వాళ్ళు ఓ గ్రామంలోకి ప్రవేశించారు.

"అబ్బ! మనుషులు ఉండే తావుకు వచ్చాం! ఇంక మనకు చక్కని కాయగూరల భోజనం దొరుకుతుంది! ఊళ్లలో ప్రజలు చాలా మంచివాళ్ళు. మనల్ని చూడగానే వాళ్ళు మనకు స్వాగతం పలికి, వేడి వేడి భోజనం, కడుపు నిండా పెడతారు" అన్నాడు సార్జంట్.

నెలలుగా సరైన భోజనం లేక తపించి పోతున్నారు పీటా, షాషాలు. నిజంగానే వాళ్ళ దగ్గర తినేందుకు ఏమీ లేవు. అడవుల్లో

కనబడ్డ ఏ జంతువునో పట్టుకొనేందుకు ఒక పెద్ద సంచి, దాన్ని ఉడకవేసుకొని తినేందుకు ఒక పెద్ద గిన్నె తప్ప ఇంక వాళ్ల దగ్గర వేరే ఏమీ లేవు. సార్జంట్ మాటలతో వాళ్ళకు ఆశ పుట్టింది. క్షణాల్లో ఆ ఆశ కాస్తా ఆకలిగా పరిణమించింది.



అయితే వీళ్ళు వెళ్ళే సరికి ఊరివాళ్ళెవ్వరూ బయట రోడ్ల మీద లేరు. వీళ్లని చూసిన వాళ్ళు కూడా కొందరు చటుక్కున కిటికీలు మూసుకున్నారు. అలా వాళ్ళు అనుకున్న స్వాగత సత్కారాలలాంటివేవీ వాళ్ళకు దొరకలేదు.

"ఏమీ పర్లేదు. చలి బాగా ఉంది కదా! అందుకని తలుపులు మూసుకున్నారు గ్రామస్థులు. మన రాకను ఎవ్వరూ గమనించి ఉండరు కూడా. వాళ్ళు గనక మనల్ని చూసి ఉంటే ఈ పాటికి మనం వేడి వేడి సూప్ త్రాగుతూ చలి మంట ముందు కూర్చొని ఉండేవాళ్ళం!" అంటూ ఒక ఇంటి తలుపు తట్టాడు సార్జంట్.

"ఎవరూ?!" అని ఒక స్త్రీ లోపలినుంచి అడిగింది.

"అమ్మా! మేము ముగ్గురం సైనికులం. చాలా దూరం నుంచి నడచి వస్తున్నాం. మాకు తినేందుకు కొంచెం ఏమన్నా దొరుకుతుందా?" అడిగాడు సార్జంట్.

"అయ్యో, తిండి లేదు. ఈ సారి మా పంట పొలం అస్సలు పండలేదు" అంది ఆ గొంతు. ఇంటి తలుపు కొంచెం కూడా

తెరుచుకోలేదు.

ఇంకొక తలుపు, మరొక ఇంటి తలుపు తట్టినా తిండి లేదనే చెప్పారు తప్ప, ఎవ్వరూ వాళ్లని లోనికి ఆహ్వానించలేదు, కనీసం కొంచెం వేడి టీనీళ్ళు కూడా పోస్తామనలేదు.

"వీళ్లంతా ఎవరో తీవ్రవాదుల తాలూకు అయి ఉంటారు. లేదా సైనికులంటే ప్రేమ లేని సాధారణ ప్రజలైనా అయి ఉంటారు. వీళ్లతో పెట్టుకుంటే మనం ఆకలితో మాడిపోతాం" అన్నాడు షాషా.



"కాదు. వీళ్లంతా స్వార్థ పరులు. పేదరికం వీళ్లకు స్వార్థాన్ని నేర్పించింది" అన్నాడు పీటా.

"నిజమే అనిపిస్తున్నది. వీళ్ళకి గుణపాఠం చెబుతాను చూడండి.. మన కడుపు నిండాలంటే ఇది తప్పదు. ఇప్పుడు నేను చెప్పినట్లు చేయండి. ఏం జరుగుతుందో చూడండి" అని వాళ్లతో గుసగుసగా ఏదో చెప్పాడు.

ఆ తర్వాత అతను ఓ ఇంటి ముందు నిలబడి, లోపలి వాళ్ళకు వినపడేటట్టు గట్టిగా "షాషా, పీటా! మీరు వెళ్ళి మాంచి రాళ్ళు తీసుకురండి.. మనం రాతిపులుసు చేద్దాం!"అన్నాడు.

"వావ్! సరే! సరే! మాకు రాతి పులుసంటే చాలా ఇష్టం!" అరిచారు పీటా, షాషాలు. ఆ వెంటనే ఇద్దరూ గట్టి గట్టి అడుగులు వేసుకుంటూ, ఉత్సాహంగా మాట్లాడు-కుంటూ అవతల ఉన్న బయలులోకి వెళ్ళి, కొద్ది సేపట్లోనే మూడు చెట్టు కొమ్మల్ని కొట్టుకొచ్చారు. సార్జంట్ వాటిని ఊరి మధ్యలో త్రిభుజాకారంగా నిలబెట్టి, తాము తెచ్చుకున్న గిన్నెను దానికి కట్టాడు. ఆలోగా

వాళ్ళిద్దరూ అటు ప్రక్కగా పారుతున్న మంచినీటి కాలువ నుండి నీళ్ళు, కొన్ని చిన్న రాళ్ళు తీసుకువచ్చి, వాటిని ఆ గిన్నెలో ఒక్కటొక్కటిగా వేస్తూ పెద్ద పెద్ద శబ్దాలు చేశారు.

"చూసావా! ఇదే, నాకు నచ్చేది, రాతి పులుసులో!" అరిచారు అందరూ.

దాంతో ఆ ఎదురుగుండా ఇంట్లో ఉన్న 'డిమిట్రి' అనే వడ్రంగికి వీళ్లు తయారు చేయబోతున్న రాతిపులుసు మీద ఆసక్తి పెరిగిపోయింది. "ఏమిటి, చేస్తున్నారు?" తలుపు తీసుకుని బయటికి వచ్చి అడిగాడు వాళ్లని.

"మంచి రాతిపులుసు.. నీకు ఏ రకం ఇష్టమో చెప్పు" అడిగాడు సార్జంట్.

"రాతి పులుసా? మేము ఎప్పుడూ వినలేదే దాని గురించి?!" ఆశ్చర్యపోయాడు డిమిట్రీ.

"వినలేదా? ఊరుకోండి! రాతి పులుసంటే తెలీని సైనికుడే ఉండడు. అంత రుచికరమైన వంటకం మీకు తెలీకపోవటమేమిటి?" అన్నాడు సార్జంట్, డిమిట్రీకి తన ప్రక్కన కూర్చునేందుకు చోటు చూపిస్తూ.

ఆలోగా పీటా, షాషాలు ఇద్దరూ గిన్నెలో నీళ్ళు పోసి, దాని కింద మంట పెట్టారు.



"రండి, రుచికరమైన రాతిపులుసు రుచి చూడండి మాతో పాటు" అని డిమిట్రీకి, అక్కడే తమ ఇళ్ళ ముందు నిలబడి 'వీళ్ళు ఏం తయారు చేస్తారు' అని ఆసక్తిగా చూస్తున్న మరో ఇద్దరు గ్రామస్థులకీ చెప్పాడు సార్జంట్.

అంతలో ఉడుకుతున్న నీళ్లలోంచి ఒక చిన్న రాయిని తీసి నోటిలో వేసుకుని, "అబ్బా ఈ విధమైన రాళ్ళు చాలా రుచికరంగా ఉంటాయి!" అని చెప్పాడు షాషా.

"ఓ మంచి గరిటె తీసుకురా, పులుసును బాగా కలపాలి. కలిపితే వచ్చే పులుసు రుచి భలే ఉంటుంది" తన ప్రక్కనే కూర్చున్న డిమిట్రీకి చెప్పాడు సార్జంట్. డిమిట్రీ చటుక్కున లేచి ఇంట్లోకి వెళ్ళి గరిటె తెచ్చి ఇచ్చాడు.

వీళ్ళ హడావుడి విని, చుట్టుపక్కల ఇళ్ళవాళ్ళు కూడా వచ్చి చుట్టూ కూర్చున్నారు. అందరూ రాతిపులుసును గురించి తెలుసుకుని ఆశ్చర్యపోయారు.

"మంచి వాసన వస్తోందా?" అడిగాడు సార్జంట్. గిన్నెకు దగ్గరగా మొహం పెట్టి "చాలా మంచి వాసన వస్తోంది" చెప్పాడు షాషా.

"ఒక ఉల్లిపాయ వేస్తే రాతిలోని మరింత రుచిని, వాసనను ఉల్లి బయటకు తెస్తుంది." నవ్వుతూ చెప్పాడు సార్జంట్.

"మా ఇంట్లో ఉల్లిపాయలు ఉన్నాయి ఆగండి" అంటూ పరుగెత్తుకెళ్ళి రెండు పెద్ద ఉల్లిపాయలు తెచ్చి ఇచ్చింది ఓల్గా అనే ఆవిడ.

"చాలు! ఇవి చాలు! ఇక రాళ్ళలోని వాసన మొత్తం తగులుతుంది ముక్కుకు!" అన్నాడు సార్జంట్, గట్టిగా వాసన పీలుస్తూ.

అతన్ని చూసి అందరూ ముక్కులు గట్టిగా పీల్చారు. పాషా కూడా గట్టిగా వాసన పీల్చి. "బాగుంది బాగుంది" అని సర్టిఫై చేసాడు.

ఒక నిముషం తర్వాత "క్యారెట్ వేస్తే మంచి ఆరోగ్యం, పులుసుకు మంచి రంగు వస్తుంది కూడా" అన్నాడు కూడా.

"దానిదేం భాగ్యం. నా దగ్గర క్యారెట్లు ఉన్నాయి ఆగండి-" అంటూ ఆన్నా అనే ఆవిడ ఇంట్లోకి వెళ్ళి క్యారెట్లు తెచ్చింది.

"చాలు! చాలు! ఇక రాతి పులుసుకు చక్కటి రంగు వస్తుంది. చూసారా! అప్పుడే కొద్దిగా రంగు మారింది?!" అంటూ గిన్నెలోని నీళ్లను

గరిటతో ఎత్తి పోసాడు సార్జంట్.

"ఒకటో, రెండో ఆలుగడ్డలు తగిలితే పులుసుకు నిండుదనం వస్తుంది" చెప్పాడు పీటా, సమయం చూసుకొని.

"మా ఇంట్లో ఆలుగడ్డలు ఉన్నాయండి" అంటూ మార్యా అనే ఆవిడ ఇంట్లోకి వెళ్ళి ఆలుగడ్డలు తెచ్చింది.

"మీరు కూడా ఇక్కడే ఉండి రాతి పులుసు రుచి చూడాలి" అని మార్యాతో అన్నాడు పీటా. అవి కొంచెం ఉడికాక "అయ్యో! ఆలుగడ్డలు రాతిలోని సువాసనను అడ్డుకుంటాయి కదా! ఇప్పుడు కొన్ని మాంసపు ముక్కలు వేస్తే చాలు- రాతిపులుసు మహా రుచిగా వస్తుంది" అన్నాడు సార్జంట్.

"మా ఇంట్లో కొన్ని మాంసపు ముక్కలు ఉన్నాయిలే, తెస్తాను ఆగు" అని మాంసపు ముక్కలు తెచ్చాడు డిమిత్రి.

అప్పటికే అక్కడికి చేరిన మరికొంతమంది గ్రామస్థులు రాతి పులుసునీ, డిమిత్రి సహాయాన్నీ పొగిడారు. రాళ్ళతో పాటు ఉల్లిపాయలు, క్యారెట్, ఆలుగడ్డలు, మాంసపు ముక్కలు ఉడికి నిజంగానే అక్కడంతా మంచి వాసన రాసాగింది.

"మీ గ్రామంలో పులుసు తయారు చేయడానికి పనికొచ్చే రుచికరమైన రాళ్ళు ఉన్నాయి. మీ అదృష్టం, వాటితోటి మీరంతా అప్పుడప్పుడూ రాతిపులుసు చేసుకోవచ్చు- ప్రస్తుతం ఈ పులుసు త్రాగడానికి పాత్రలు తెచ్చుకోండి" అని చెప్పారు సార్జంట్, షాషా.

"మేమింత వరకూ ఇంత రుచికరమైన పులుసు ఎప్పుడూ తాగలేదు" అంటూ డిమిత్రీ, ఓల్గా, ఆన్నా లతో పాటు మరో నలుగురు గ్రామస్థులు పులుసు ఇష్టంగా తాగారు. వాళ్లకంటే ఇష్టంగాను, ఆకలిగాను త్రాగారు ముగ్గురు సైనికులూనూ!

అట్లా కడుపు నిండాక, రాతిపులుసుకు మనస్ఫూర్తిగా కృతజ్ఞతలు చెప్పుకుంటూ సైనికులు ముగ్గురూ ఇంటి బాట పట్టారు.

# పదరంగం-103

*నిర్వహణ: డా. సిరి, మిర్యాలగూడ, నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం*

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | ★ | 2 | | 3 | ★ |
| 4 | | | ★ | 5 | 6 |
| | ★ | 7 | 8 | ★ | |
| ★ | 9 | | | 10 | ★ |
| 11 | ★ | | ★ | 12 | 13 |
| 14 | | ★ | 15 | | |

**నిలువు**

1. ఇది ఉంటే ఎంతటి అపాయాన్నుంచైనా తప్పించుకోవచ్చు (3)
2. 'Bear' ని తెలుగులో ఇలా అంటారు(5)
3. తలక్రిందులైన 'కోడి' (2)
6. 'వరాహం' (2)
8. జుట్టులో జీవించే ప్రాణి (2)
10. 'భూమి' కి మరో పేరు (3)
11. 'మలేరియా' జ్వరానికి కారణమైన కీటకం (2)
13. 'తీగ' మరోలా (2)

**అడ్డం**

2. రేపుకి రేపు, మరో రకంగా (3)
4. ఉపాధ్యాయులు తరగతిలో చెప్పేవి (3)
5. శాంతానికి వ్యతిరేకం (2)
7. తిరగబడిన 'పేగు' (2)
9. అటునుండి వచ్చిన 'అనుబంధం' (4)
12. చేపలు పట్టడానికి ఉపయోగించే సాధనం (2)
14. Religion, తెలుగులో (2)
15. 'స్త్రీ' ని ఇలా కూడా అనచ్చు (3)

అడ్డం-నిలువు ఆధారాల సహాయంతో ఈ గడులను నింపగలరేమో చూడండి. నింపిన పదరంగాన్ని, కేవలం పోస్టుకార్డుపై రాసి, మాకు అందేట్లు పంపండి. మీ బడి పేరు, తరగతి, మీవాళ్ల ఫోను నంబరు తప్పక రాయండి.

సరైన సమాధానం రాసి ఎంపికైన ముగ్గురు పిల్లలకు కొత్తపల్లి - 103 ని బహుమతిగా పంపిస్తాం!

మా చిరునామా: కొత్తపల్లి, 1-127/A, యంఆర్వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి- అనంతపురం జిల్లా- 515101

# ఆట వెలదులు

**రచన: శ్రీ రాయాపురం లింగారెడ్డిగారు**

**ప్రతులకు: శ్రీ లింగారెడ్డిగారు యంఐజి- 319 (28-05-435), హౌసింగ్ బోర్డ్ కాలనీ, అనంతపురం, ఫోను: 7330864140**



పిల్లలకు కూడా అర్థమయ్యేట్లు చిన్న చిన్న పదాలతో ఆటవెలదులు కూర్చారు విశ్రాంత ప్రధానోపాధ్యాయులు శ్రీ లింగారెడ్డిగారు. ఇరవై రూపాయల ఈ చిరుపుస్తకంలో ఆణిముత్యాల్లాంటి నూట ఎనిమిది పద్యాలున్నాయి. పిల్లలకు, పిల్లలకు తెలుగు పట్ల మక్కువ పెంచుదామనుకునే వారికి, భాషాభిమానులకు ఇవి చాలా ఉపయోగ పడతాయి.

మచ్చుకి కొన్ని:

చెప్పు చేత బట్టి చెంపకు కొట్టినా
బద్ధకస్తుడెపుడు బాగు పడడు
చీమకెవడు నేర్పె చెమటోడ్చు గుణమును?
సత్య శోభితంబు సారి పలుకు

పుస్తకము రచయిత మస్తక జనితము
కాలగమనమందు చిలికిన సుధ
మంచి పొత్తములకు మించిన సిరి లేదు
ముదముతోడ యువత చదువవలెను

లంచగొండితనము అంతమగు వరకు
భారతావని గతి బాగు పడదు
చిల్లు బడిన ఓడ చేరునా గమ్యంబు?
సత్య శోభితంబు సారి పలుకు

విద్య నేర్వనట్టి విద్యార్థులుందురు
చదువు చెప్పనట్టి చవటలున్న
వానలేని చోట వంకలు పారునా?
సత్య శోభితంబు సారి పలుకు

అంటరానివాయె సద్దలు రాగులు
కొర్ర బువ్వ తినరు వెర్రి జనులు
డొల్లతన మెరుగుము తెల్లబియ్యములోని
సత్య శోభితంభు సారి పలుకు.

ఆపద దరిచేర ఆందోళన వలదు
జీవితమున దీపి చేదులుండు
గుండె బలము తోడ మొండిగా సాగుము
సత్య శోభితంబు సారి పలుకు.

RNI Regn No. : APTEL/2014/62705 Date Of Publishing: 05/01/2019 Postal Regn No: HDP/008/2018-2020

**కొత్తపల్లి** ప్రింటు పుస్తకాలను ఆన్‌లైన్లో ఆర్డరు చేయటం, చందాలు కట్టటం చాలా సులువు! క్రెడిట్ కార్డుల ద్వారాను, డెబిట్ కార్డుల ద్వారాను, నెట్ బ్యాంకింగ్ ద్వారా కూడా కొత్తపల్లికి డబ్బులు చెల్లించవచ్చు! అక్కౌంటు నెంబర్లు వెతుక్కునే పని కూడా లేదు! సందర్శించండి: **http://www.instamojo.com/kottapalli**

**కొత్తపల్లిని మీ మిత్రులకు, మీరు చదివిన బడులకు, మీ సమీపంలోని లైబ్రరీలకు బహూకరించండి!**

కథల పుస్తకాలండీ కథల పుస్తకాలు! పిల్లలు చెప్పిన కథలున్నాయ్! పెద్దలు వ్రాసిన కథలున్నాయ్!

రంగురంగుల బొమ్మలున్నాయ్! అక్కడక్కడా జోకులున్నాయ్!

ఆన్‌లైన్‌లో దొరుకుతున్నాయ్! ఇప్పుడే కొనండి! అందరికీ చెప్పండి!!!






**రాబోయే 12 సంచికలకై ముందస్తు చందా:**

**రూ. 360/-** (పోస్టేజీ మరియు యస్సెమ్మెస్ ఛార్జీలు కలిపి)

గమనిక: అచ్చయిన పుస్తకాలు ఎప్పటికప్పుడు సాధారణ పోస్టులో పంపబడతాయి.

NEFT TRANSFER కోసం:

"Kottapalli Prachuranalu"
SB A/c 62320333310,
State Bank of India
Dharmavaram Branch
IFSC: SBIN0020902

(బ్యాంకు వారి నియమాలననుసరించి, "క్యాష్ హ్యాండ్లింగ్ చార్జీలు"గా ప్రతిసారీ రూ. 50 అదనంగా చెల్లించవలసి వస్తున్నది.. అందువల్ల బ్యాంకులో డబ్బు కట్టకండి- నేరుగా మీ అక్కౌంటు నుండే ట్రాన్సుఫర్ చేయగలరని ప్రార్థన)

ప్రస్తుతం అందుబాటులో ఉన్న కొత్తపల్లి ప్రింటు పుస్తకాల వివరాలు:

| క్రమ సంఖ్య | వివరాలు | ఒక సెట్ లోని పుస్తకాల సంఖ్య | స్టాకులో ఉన్న సెట్లు (సుమారుగా) | వెల (రూ) **(పోస్టేజి అదనం)** |
|---|---|---|---|---|
| 1 | 2012 Set | 7 | 10 | 140 |
| 2 | 2013 Set | 3 | 73 | 75 |
| 3 | 2014 Set | 10 | 303 | 250 |
| 4 | 2015 Set | 7 | 721 | 175 |
| 5 | 2016 Set | 8 | 880 | 200 |
| 6 | 2017 Set | 7 | 1150 | 175 |
| 7 | 2018 Set | 7 | 1250 | 210 |

మరిన్ని వివరాలకై సంప్రతించండి: కొత్తపల్లి ప్రచురణలు, 1-127/A, యంఆర్వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా. పిన్: 515101. ఫోను: 7702877670, 9490180695. ఇ-మెయిలు : team@kottapalli.in

"Kottapalli" Printed and Published by Narayana Sarma on behalf of Kottapalli Prachuranalu and printed at Mudrica Offset Printers, Vijayawada and published at 1-127/A, Near MRO Office, Chennekothapalli, Ananthapuram District, AP-515101. Editor: Narayana Sarma.